# ఆనంద ద్వీపం

క్యాడ్‌బరీస్

# జెమ్స్




చాక్లెట్ మధ్యలోగలిగిన రంగురంగుల క్యాడ్‌బరీస్ జెమ్స్

CHAITRA-C-105 TEL

# ఒక్క ఓడోమాస్ మాత్రమే ఖచ్చితంగా దోమలబారినుండి 2 విధాలుగా కాపాడుతుంది...

## మీరు రాత్రంతా హాయిగా నిద్రపోయేందుకు తోడ్పడుతుంది.

ఓడోమాస్ మరే యితర దోమల నివారిణి సమకూర్చని రీతిలో రక్షణ సమకూరుస్తుంది:

1


దీని వాసన దోమలను దూరంగా ఉంచుతుంది.

2


దీనిలోగల ప్రత్యేకమైన మూలపదార్థం దోమల బారి నుండి మీ చర్మాన్ని కవచంగా కాపాడుతుంది...రాత్రంతా.

ఇక, ఓడోమాస్ భారతదేశంలో అత్యధికంగా అమ్మబడుతున్న దోమల నివారిణి అంటే ఆశ్చర్యమేముంటుంది మరి!

దోమల బాధకు గురికాకండి—

# ఓడోమాస్

**అందుబాటులో ఉంచుకోండి!**




CHAITRA-BLS-86 TEL

కొత్తది!

# అముల్
# మాల్ట్-కోకో పానీయం
# న్యూట్రామూల్
## ప్రతి కప్పు మీకు పోషణను ఇచ్చు




ప్రతి డబ్బాలో 50 గ్రాముల ఎక్కువ సరుకు

అముల్ బలాన్నిచ్చే న్యూట్రాముల్ – ఇంతకుమును పెన్నడూ అందించబడని ఆరోగ్యాన్నిచ్చే పానీయం సమర్పిస్తోంది. సమృద్ధిగా పాలు, శుద్ధమైన మాల్ట్, ప్రోటీన్లు, విటమిన్లు, ఖనిజములుగలది, ప్రతి కప్పు ఆరోగ్యాన్ని, శక్తిని పెంపొందిస్తుంది.

మరిక దీని రుచి! అమ్మమ్మ! ఎంతో ఎక్కువ కోకో మరెంతో ఎక్కువ పాలు

సమృద్ధియైన నురుగు గల కోకో గలది. న్యూట్రాముల్ అముల్‌వారి కొత్త పాలు మరియు ఆహారాల ప్రోసెసింగ్ కేంద్రంలో—ప్రపంచంలో మేలైన వాటిలో ఇది ఒకటి–రూపొందించబడుతోంది

ప్రతి న్యూట్రాముల్ డబ్బాలో 500 గ్రాముల సరకు ఉంటుంది. అంటే ఇతర వాటికన్న 50 గ్రాములు (5 కప్పులు) అదనం అన్న మాటేగా.

న్యూట్రాముల్ నేడే వాడి చూడండి.





మార్కెట్ చేయువారు:
గుజరాత్ కో-ఆపరేటివ్
మిల్క్ మార్కెటింగ్
ఫెడరేషన్ లిమిటెడ్
ఆనంద్, గుజరాత్

daCunha/Nutra/1 P Tel

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''దరిద్రుని వాక్కు''] కె. హరనాథ్ రచన.

మూఢవిశ్వాసాలు స్వార్థం నుంచీ, భయం నుంచీ పుట్టుకొస్తాయి. ఈ రెండింటి వెనకా వ్యక్తుల అసహాయత్వం ఉంటుంది. పరిపాలన క్రూరంగా ఉన్నప్పుడు దాన్ని ఎదిరించలేని ప్రజలు తమకు కష్టాలు దేవుడు తెచ్చిపెట్టాడనుకుంటారు. పాలకులను నిందించటానికి భయపడేవాళ్ళు దేవుణ్ణి నిందించటానికి భయపడరు. అలాగే తమ శక్తి వల్ల చేకూరని లాభం ఏ బిచ్చగాడి నోటిచలవనో సమకూరితే వాడిలో మహత్తు చూస్తారు.

సంపుటి 61 నవంబర్ '77 సంచిక 5

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00









హర్షః, కామశ్చ, దర్పశ్చ,
ధర్మః, క్రోధ, శ్శమో, దమః
అర్థా దేతాని సర్వాణి
ప్రవర్తంతే.... 1

[సంతోషమూ, కామమూ, గర్వమూ, ధర్మమూ, కోపమూ, శాంతీ, దాంతీ, ఇవన్నీ ధనమున్న వాడిలోనే రాణిస్తాయి.]

పీడాకర మమిత్రాణాం
యత్స్యాత్ కర్తవ్యమేవ తత్. 2

[శత్రువులకు ఏది బాధాకరమో అదంతా చేయదగినదే.]

అయుధ్యమానం, ప్రచ్ఛన్నం,
ప్రాంజలిం, శరణాగతమ్,
పలాయంతం, ప్రమత్తం వా,
న త్వం హంతు మిహార్హసి. 3

[యుద్ధానికి సిద్ధంగా లేనివాణ్ణీ, దాగినవాణ్ణీ, దణ్ణం పెట్టేసినవాణ్ణీ, శరణన్నవాణ్ణీ, పారిపోయేవాణ్ణీ, ఏమరి ఉన్నవాణ్ణీ (నువు) చంపరాదు.]

న రణే శక్యతే జేతుం
వినా యుద్ధేన వాగ్బలాత్. 4

[యుద్ధంలో పోరి జయించాలిగాని మాటలతో కాదు.]

సూక్తులు




## 53

చీకటి పడే వేళకు అరిమర్దనం తన అనుచరులతో కాకులను వేటాడటానికి మర్రిచెట్టు వద్దకు వచ్చి, ''రాజుకూ, కుల పెద్దకూ చెడిందిగనకనూ, వాళ్ళు వెళ్ళిపోయే ప్రయత్నంలో ఉన్నారుగనకనూ, మనకు పెద్ద ప్రతిఘటన ఉండబోదు,'' అన్నది.

గుడ్లగూబలు పెద్ద అట్టహాసంతో మర్రి చెట్టు మీద విరుచుకు పడ్డాయి. కాని ఆ చెట్టుపైన ఒక్క కాకి కూడా లేదు. వాటికి చెట్టుకింద గాయపడి, హీనస్వరం పడి ఉన్న స్థిరజీవి మాత్రమే కనిపించింది. గుడ్లగూబలు దాన్ని చంపబోతే, అది వాటితో, ''నన్ను చంపకండి. నన్ను మీ రాజు దగ్గరికి తీసుకుపొండి. నేను అతనికి చాలా విషయాలు చెప్పాలి,'' అన్నది.

గుడ్లగూబలు అరిమర్దనానికి ఈ మాట చెప్పాయి. అది స్థిరజీవి వద్దకు ఎగిరి వచ్చి, ''అయ్యా, నువు కాకుల పెద్దవు గదా, ఇలా గాయపడి, దుస్థితికి రావటానికి కారణం ఏమిటి?'' అని అడిగింది.

స్థిరజీవి ఇలా అన్నది:

''రాజా, విను. నిన్న ఆ దుర్మార్గపు మేఘవర్ణం, తన కాకులనే చాలా వాటిని నువు చంపావని, మీ గుడ్లగూబల గుహ మీదికి దాడి తల పెట్టింది. బలవంతులతో విరోధం తగదు, సంధి చేసుకుని, కాకిజాతిని కాపాడుకోమన్నాను. అతను మండిపడి నా ఈకలు పీకి, నన్ను చీల్చి చెండాడి, నన్ను రాజద్రోహి అని, ఇక్కడ పడేసి, 'నీ మిత్రులైన గుడ్లగూబలతోనే ఉండు,' అని లేళ్లకొండకు సపరివారంగా వెళ్ళిపోయాడు.''



దానికి అరిమర్దనం, "మూర్ఖుడు! వాడు చేరిన కొత్తచోటు నాకు బాగా తెలుసునని ఎరగడు. నిన్ను ఇలా చేసినందుకు వాణ్ణీ, వాడి కాకిబలగాన్నీ చంపి ప్రతిక్రియ చేస్తాను," అన్నది.

"రాజా, నువే నాకు దిక్కు. నేను వాడికి విశ్వాసం చూపటం మాని, నీకు చూపుతాను. నిన్ను ఆ దుర్మార్గుడి స్థావరానికి తీసుకుపోయి, కాకులను నిర్మూలించటానికి తోడ్పడతాను," అన్నది స్థిరజీవి.

అరిమర్దనం తన మంత్రులతో సంప్రతించింది. వాటి పేర్లు రక్తాక్ష, క్రూరాక్ష, దీప్తాక్ష, వక్రనాస, ప్రాకారకర్ణాలు. స్థిరజీవిని ఏం చెయ్యాలి. దాని సహాయం పొందాలా, వద్దా అన్న ప్రశ్నలు చర్చకు వచ్చాయి. "నీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగితే రక్తాక్ష, "వెధవను చంపి పారెయ్యండి. గాయపడి దుర్బలంగా కూడా ఉన్నాడు. తేలికగా చంపవచ్చు. మళ్ళీ కోలుకుంటే ఎగిరి పారిపోయి మనకు సమస్య అయి కూర్చోవచ్చు. బ్రాహ్మడి కొడుకును చంపి, బ్రాహ్మడు స్వార్థంతో చేసిన రాజీబేరాన్ని తోసిపుచ్చిన పాములాగా, మీరు దీని సలహా, సహకారాలను నిరాకరించండి," అన్నది.

"ఏమిటా కథ?" అని అరిమర్దనం అడగగా రక్తాక్ష "బ్రాహ్మణుడు—పాము" కథ ఇలా చెప్పింది:

హరిదత్తుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతనికి ఒక పనికిమాలిన పొలం ఉండేది. అందులో పండే పంట అతనూ, భార్యా, కొడుకూ తినటానికే చాలేదికాదు. అతను ఒక రోజు తన చేనుకు కాపలా కాస్తూ ఒక చెట్టు నీడన చిన్నకునుకు తీశాడు. అతను మళ్ళీ కళ్ళు తెరిచి చూసేసరికి, పొలంలో ఉన్న పుట్టలో నుంచి ఒక భయంకరమైన నాగుపాము బయటికి వస్తూండటం కనబడింది. "ఓహో, ఇది నా పొలానికి అధిష్ఠాన దేవత అయి ఉండాలి. దీనిని ఆరాధించక

పోవటం చేతనే నన్ను దరిద్రం వెంటాడుతున్నది,'' అనుకుని హరిదత్తుడు ఒక పిడతలో పాలు తీసుకుని వచ్చి, ఆ పాలను పుట్టకన్నం వద్ద ఉంచి, ''నాగరాజా, దారిద్ర్యబాధ అనుభవిస్తున్న నన్ను అనుగ్రహించు,'' అని ప్రార్థించాడు.

పాము ఆ పాలను తృప్తిగా తాగింది. మర్నాడు హరిదత్తుడు అక్కడికి వెళ్ళి, పిడతలో బంగారునాణెం ఉండటం చూసి, తాను పోసిన పాలకు అది ప్రతిఫలం కాబోలు ననుకున్నాడు.

అటుతరవాత అతను రోజూ పాముకు ముంతెడు పాలు ఇచ్చి, పూజించి, మర్నాడు ఒక బంగారు నాణెం పుచ్చుకుంటూ వచ్చాడు.

ఒకసారి అతను పొరుగూరు వెళ్ళవలసివచ్చి, పుట్ట వద్దకు పాలు తెచ్చి, పామును పూజించేపని తన కొడుక్కు అప్పగించాడు.

''పుట్టనిండా బంగారు కాసులు ఉండి ఉంటాయి. ఈ వెధవపాము ఒక్కొక్క కాసే ఇస్తున్నది,'' అనుకుని బ్రాహ్మడి కొడుకు, పాము పాలు తాగేటప్పుడు, దాన్ని చంపే ఉద్దేశంతో కర్రపెట్టి దాని నెత్తినకొట్టాడు. తరవాత పుట్ట తవ్వి బంగారం తీసుకోవాలని వాడి ఉద్దేశం.

అయితే పాము దెబ్బ తప్పుకుని, దారుణమైన కోపంతో కుర్రాణ్ణి కాటేసి చంపింది. బ్రాహ్మడు తిరిగివచ్చి ఈవార్త విని, కుర్రాడికి దహనక్రియలు జరిపి, మళ్ళీ పాము కోసం పాలు తీసుకుపోయి, ''నాగరాజా, నీ తప్పేమీలేదు. నిన్ను చంపబోయి మా వాడే తన చావు తెచ్చుకున్నాడు,'' అన్నాడు.

దానికి పాము ఇలా అన్నది:

''బ్రాహ్మడా, నేను నీ కొడుకును చంపినప్పుడే మనిద్దరి మధ్యా ఉన్న బంధం తెగిపోయింది. ఈ జన్మలో మళ్ళీ నువు నన్ను ప్రేమించలేవు. నీ కొడుకు శవం మన ఇద్దరి మధ్యా శాశ్వతమైన అడ్డంకి, అందుచేత నువు నీ దారినపో. నేను కూడా ఈ పుట్ట విడిచిపోతున్నాను.''



ప్రపంచపు వింతలు :

# 191. మూడువేల ఏళ్ళ చరిత్ర

**బేరూట్** లోని ఈ శిలల మీద **3,000** ఏళ్ళ చరిత్ర లిఖించి ఉన్నది. ఈజిప్టు, అసిరియా, గ్రీస్, రోమ్, ఫ్రాన్స్ వగైరా అనేక దేశాలసేనలు ఇటుగా వెళ్ళాయి. కొందరు ప్రతిమలనూ, శాసనాలనూ కూడా చెక్కారు. దిగువన అరిగిపోతూ అస్పష్టంగా ఉన్న శిల్పం క్రీస్తు పూర్వం 9వ శతాబ్దినాటి అసిరియా రాజు, మూడవ అషుర్‌నాజిర్‌పాల్‌ది అని చెబుతారు.





# మాయాసరోవరం

## 23

[ జయశీల, సిద్ధసాధకులకు నది దగ్గిర మకరకేతుతోపాటు దేవశర్మ కూడా కనిపించాడు. ఆ సమయంలో హంసలరథం ఒకటి వచ్చి నదిలో దిగింది. ఆ రథం మీదినుంచి జారి అరణ్యంలో పడిపోయిన మాయాసరోవరేశ్వరుణ్ణీ, కాంచనమాలనూ ఎలా రక్షించటమా అని వాళ్ళు ఆలోచించేంతలో జలవృకరాక్షసులు హంసలరథం మీదికి దాడి వచ్చారు. తరవాత—]

హంసల రథాన్ని చుట్టుముట్టి పట్టుకోవాలని చూస్తున్న జలరాక్షసులు కంటబడగానే, జయశీలుడు దూరంగా పారవేసిన కత్తిని చప్పున చేతికి తీసుకుని, "వీళ్ళేనా జలవృక రాక్షసులు! తోడేళ్ళ తలలూ, మానవ శరీరాలూ—వింతగా వున్నారు," అన్నాడు.

మకరకేతు తన చేతగల ఆయుధాన్ని పైకెత్తి పట్టుకుని, ఎంతో ఆదుర్దా పడిపోతూ నాలుగడుగులు నది కేసి నడిచి, అంతలోనే ఆగిపోయి, జయశీలుడితో, "జయశీలా! ఈ జలరాక్షసులు హంసల రథాన్ని పట్టుకోవాలని చూస్తున్నారు. వాళ్లను హతమార్చేందుకు మాకు సాయం రాలేవా?" అని అడిగాడు.

జయశీలుడు తాపీగా తన కత్తిని ఒరలో పెడుతూ, "మా కనకాక్షరాజు గారి పిల్లలను మీ మాయాసరోవరపు



"జయశీలా, నా మాట విని, ముందు కత్తిని ఒరలోనుంచి బయిటికి లాగు. సరోవరేశ్వరుడి మీద పగ సాధించేందుకు యిది సరి అయిన తరుణం కాదు," అన్నాడు దేవశర్మ.

ఆ మరుక్షణం జయశీలుడు కత్తి దూశాడు. ఆ వెంటనే సిద్ధసాధకుడు, "జై, మహాకాళా!" అంటూ ఎగిరి నరవానరం మీద కూర్చున్నాడు. కను మూసి తెరిచేంతలో అందరూ భీకరంగా అరుస్తూ పోయి, నదిలో దూకి, జల రాక్షసులను ఎదుర్కొన్నారు.

ఈ లోపల హంసల రథంలో వున్న అంగరక్షకుడు రథాన్ని జలరాక్షసుల చేతబడకుండా నదిలో అటూ ఇటూ పరిగెత్తించసాగాడు. ఏనుగు జలగ్రహం మీద ఎక్కి, కత్తి తిప్పుతూ తమ పైకి వచ్చిన మకరకేతుణ్ణీ, నరవానరం మీద సవారీ చేస్తూ వచ్చిపడిన సిద్ధసాధకుణ్ణీ చూసి జలరాక్షసులు హడలిపోయారు. వాళ్ళు పారిపోయేందుకు నీట మునగ బోయేంతలో, మకరకేతుడు ఉసికొల్పిన జలగ్రహం, వాళ్ళను తొండంతో పట్టి ఎత్తి, నది ఒడ్డుకు విసిరి వేయసాగింది. జయశీలుడు నీళ్ళలో ఈదుతూ, అందిన శత్రువులను అందినట్టు తన కత్తితో పొడవసాగాడు.

రాజు అపహరించుకుపోయాడు. నాకు వాళ్ళను రక్షించవలసిన బాధ్యతే కాక, ఈ దుర్మార్గానికి పాల్పడిన మీ రాజు మీద పగ తీర్చుకోవలసిన అవసరం కూడా వున్నది. ఆ హంసల రథంలో మీ రాజు లేకపోవటం, అతగాడి అదృష్టం, తెలిసిందా?" అన్నాడు కోపంగా.

ఆ జవాబుకు మకరకేతుడు వెలవెల పోయి, దేవశర్మతో, "వైద్యదేవా, జయశీలుడికి మా మీద యింత గాఢమైన శత్రుత్వం వుంటుందని నేనూహించలేదు. రాచపిల్లల కెలాంటి హానీ, మాయాసరోవరేశ్వరుడు చేయకపోగా, వాళ్ళిద్దరినీ ఎంతో ప్రేమగా సాకుతున్నాడు," అన్నాడు.

ఒక పావుగంట కాలం గడిచే లోపలే జలవృకరాక్షసుల్లో కొందరు మరణించారు. చాలామంది బాగా గాయపడి, నీట మునగలేకా, తేలలేకా నదీజలం వాలున పడి కొట్టుకుపోసాగారు. జలగ్రహం తొండంతో చుట్టి ఒడ్డుకు విసిరిన వాళ్ళు, నడుమూ, కాళ్ళూ చేతులూ బెణకటంతో, లేచి నీటి దగ్గిరకు పోబోయి, అది సాధ్యంకాక కీచుమని అరుస్తూ గిలగిలా తన్నుకోసాగారు.

సిద్ధసాధకుడు ఎక్కివున్న నరవానరం ఒక జలవృక రాక్షసుణ్ణి రెండు చేతులతో గట్టిగా పట్టుకుని, సాధకుడితోపాటు నీటి నుంచి బయిటికి వచ్చింది. అతడి వెనకగా మకరకేతుడూ, సర్పనఖ, సర్పస్వరులూ ఒడ్డు చేరారు. జయశీలుడు మాత్రం హంసల రథంలో ఎక్కికూర్చుని, అందులో వున్నవాడికి కత్తి చూపి బెదిరిస్తూ, "ఒరే, సరోవరేశ్వరుడి అంగరక్షకుడా, రథాన్ని ఒడ్డుకుచేర్చు! రథంతో పాటు ఆకాశంలోకి ఎగిరి పారిపోవాలని చూశావో, ముందు నీ తల మొండెం నుంచి వేరై పోతుంది, జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

ఆ మాటలకు అంగరక్షకుడు కళ్ళెర్ర చేసి, "మహాశక్తి సంపన్నుడైన మాయా సరోవరేశ్వరుడి అంగరక్షకుణ్ణి, నేను! అలాంటి నన్ను యింతవరకూ యిలా దూషించి అవమానపరిచిన వాడెవడూ లేడు!" అన్నాడు.





"నేనున్నాను! ఏదీ చూస్తాను, కత్తి దూయగలవా?" అంటూ జయశీలుడు తన కత్తిని కిందపెట్టి, ఎడమ చేత్తో అంగరక్షకుడి మెడను గట్టిగా వడిసి పట్టుకున్నాడు.

అంగరక్షకుడు ఆ గుప్పెట బిగింపుకు విలవిల్లాడిపోతూ, "నువ్వెవరోగాని గొప్ప ధైర్యశాలివేగాక; బలవంతుడివి కూడా. నా మెడ వదులు," అన్నాడు.

జయశీలుడు అతడిని వదిలి, "ఇక మారు మాట్లాడకుండా, నీ రథాన్ని ఒడ్డుకు నడుపు. నీ యజమాని గురించి, నీతో మాట్లాడవలసింది చాలా వున్నది," అన్నాడు.

అంగరక్షకుడు మరి నోరెత్తకుండా హంసలను అదిలించి, వాటిచేత రథాన్ని నది ఒడ్డుకు లాగించాడు. రథం ఒడ్డుకు చేరగానే సిద్ధసాధకుడు ఉత్సాహంగా నరవానరం మీది నుంచి కిందికి దూకి, వానరం చేతుల్లో భయకంపితుడై వున్న జలవృక రాక్షసుడి చెవులు రెండూ పట్టుకుని నేలమీదికి దింపి, "ఓరే, నీటి తోడేలు వెధవా, పారిపోవాలని చూశావో చిత్రవధ చెయ్యగలను!" అని హెచ్చరించి, హంసల రథం దగ్గిరకుపోయి, "జయశీలా! ఈ రథంమీద నరవానరంతో హిమాలయ శిఖరాలకుపోయి, అక్కడ తపస్సు చేసుకోవాలని వున్నది. మా ఇద్దర్నీ యిది మోయగలదంటావా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు చిరునవ్వు నవ్వుతూ జయశీలుడు, రథంలో వున్న అంగరక్షకుడి కేసి చూశాడు. అంగరక్షకుడు రథచక్రాన్ని కళ్ళకద్దుకుని, "అయ్యా, యిది మహత్తుగల రథం. ఈ హంసలు కేవలం అలంకార ప్రాయమైనవి. సరోవరేశ్వరుడు కోరితే రథం, ఏడేడు పధ్నాలుగు లోకాలూ చుట్టబెట్టి రాగలదు. నా మాట నమ్మండి," అన్నాడు.

"అలాగా! అంత మహత్తైన రథం అరణ్యంలో రాబందుల దాడికి తలకిందు

లెందుకైంది? ఆ సమయంలో నువ్వనే మాయాసరోవరేశ్వరుడు కూడా రథంలోనే వున్నాడు కదా? ఇక నోరుముయ్యి, శూలానికి గుచ్చి నది మధ్యకు విసిరివేయ గలను,'' అంటూ సిద్ధసాధకుడు అంగ రక్షకుడి పైకి శూలం ఎత్తాడు.

జయశీలుడు అతణ్ణి శాంతించమని, ''సాధకా, రథంమీది నుంచి అరణ్య వృక్షాల్లోకి జారిపడింది ఒక్క సరో వరేశ్వరుడే కాదు; హిరణ్యపురం రాజు కనకాక్షుడి కుమార్తె కాంచనమాల కూడా ఆ ప్రమాదానికి గురైంది. ఆ మాట మరవకు,'' అన్నాడు.




మకరకేతుడు విచారంగా ముఖంపెట్టి, ''జయశీలా, మా రాజును వెతికి రక్షించేందుకు మేం యీ హంసల రథం మీద బయలుదేరుతున్నాం. ఆ మహారాజు ఎలా వున్నాడో ఏమో?'' అన్నాడు.

''మేమూ బయలుదేరుతున్నాం. రాజ కుమార్తె కాంచనమాల ఏమైందో తెలుసు కోవాలి. ఒకవేళ ఆమెకు పెద్ద ప్రమాదం ఏమైనా జరిగివుంటే, అందుకు మీ రాజుదే పూర్తి బాధ్యత. అతడి తలను కనకాక్ష రాజుకు కానుకగా యివ్వబోతున్నాను,'' అన్నాడు జయశీలుడు.

అంతవరకూ తలవంచుకుని దీర్ఘంగా ఆలోచిస్తున్న దేవశర్మ, అప్పుడు చప్పున తల పైకెత్తి, ''జయశీలా, లోగడే చెప్పాను, పగ సాధించేందుకు యిది సమయం కాదని. వెంటనే బయలుదేరి ఆ సరోవరేశ్వరుడూ, కాంచనమాలా అరణ్యంలో ప్రాణాలతో వున్నారో లేదో తెలుసుకోవటం ముఖ్యం,'' అన్నాడు.

''అవునవును, సరోవరరాజు మాటేమో గాని, కాంచనమాల సజీవురాలు అవునో కాదో తెలుసుకోవటం నాకూ, సిద్ధ సాధకుడికీ ముఖ్యం. ఏం, సాధకా, యిక ప్రయాణం అవుదామా?'' అన్నాడు జయశీలుడు.

సిద్ధసాధకుడు చుట్టూ ఓమారు కలయ చూసి, ''ఇంత భీకర మహారణ్యంలో



వాళ్ళు ఎక్కడ పడిపోయారో తెలుసు కోవటం ఎలా ?'' అన్నాడు.

సాధకుడు యిలా ప్రశ్నించగానే హంసల రథంలోని అంగరక్షకుడు ఒడ్డుకు దిగి, సాధకుణ్ణి సమీపించబోయి, నర వానరం కళ్ళురమగానే వెనక్కు రెండడు గులువేసి, ''అయ్యా, మా రాజుగారూ, కాంచనమాల అనే రాజకుమారి అరణ్యంలో పడిపోయిన చోటు నాకు బాగా తెలుసు. ఆ ప్రదేశానికి దాపులనే ఒక కొండవున్నది ; ఆకాశాన్నంటే మహా వృక్షాలున్నవి ; ఒక చోట చెట్టూచేమా లేని ఖాళీప్రదేశాన్నుంచి, తెల్లని పొగ ఆకాశం కేసి లేస్తున్నది,'' అన్నాడు.

''అదీ సంగతి! అంగరక్షకుడి సాయంతో మనం ఆ ప్రదేశాన్ని చేరగలం. ఇక రథం ఎక్కండి,'' అంటూ దేవశర్మ రథం కేసి బయలుదేరాడు.

''వైద్యదేవా! రథంలో అందరికీ చోటుంటుందా ? సిద్ధసాధకుడూ, అతడి వాహనం మాటేమిటి ? మకరకేతు తన జలగ్రహంతో ఆకాశంలోకి ఎగిరి, మనను అనుసరిస్తాడా? '' అన్నాడు జయశీలుడు.

దేవశర్మ అందరికేసీ ఓమారు చూసి, ''వాహనాలున్న వాళ్ళంతా, తమ వాహనాల మీద రావలసిందే. ఏం, సాధకా ? ఏం, మకరకేతూ ? '' అన్నాడు.

మకరకేతు, సిద్ధసాధకుడి కేసి చూశాడు. సిద్ధసాధకుడు పళ్లుకొరుకుతూ మకరకేతు కేసి గుచ్చి చూస్తూ, ''మేము, మీ అంత వేగంగానూ, ఆ అరణ్య ప్రాంతాన్ని చేరగలం. కాని, దారిలో యీ మకరకేతు ఏదైనా మోసం చేయాలని చూశాడో—యితగాణ్ణి నా నరవానరానికి మేతగా వేస్తాను,'' అన్నాడు.

''సాధకా, కోప్పడకు. ఇప్పుడు మన మంతా మిత్రులం,'' అన్నాడు మకరకేతు నవ్వేందుకు నానా హైరానాపడిపోతూ.

''ఈ మాట చాలాసార్లు విన్నాను! రాజుగారి పిల్లలు కాంచనమాలా, కాంచన వర్మా సురక్షితంగా మాకు దొరికేవరకూ,

మీ మాయాసరోవరం తండాగాళ్ళందరూ మాకు పరమ శత్రువులు!'' అన్నాడు సిద్ధసాధకుడు.

ఆ తరవాత సాధకుడూ, మకరకేతూ తప్ప మిగతావాళ్ళందరూ హంసల రథంలో ఎక్కారు. అంగరక్షకుడు వాళ్ళిద్దరికీ రావలసిన దిక్కు చూపించి, ''ఒక పెద్దకొండా, మేఘాలను తాకే మహావృక్షాలూ....బాగా గుర్తుంచుకోండి,'' అన్నాడు.

హంసలరథం ఆకాశంలోకి లేచింది. అది అలా కనబడకుండా పోగానే సిద్ధ సాధకుడు నరవానరం భుజాల మీద ఎక్కి కూర్చుని, ''కేతూ, యిక బయలు దేరుదామా?'' అన్నాడు.

మకరకేతు తల ఊపి, జలగ్రహం మీదికి పోయాడు. అంతలో సాధకుడికి బందీగా దొరికిన జలవృకరాక్షసుడు, అతడికి ప్రాణాచారం పడిపోతూ, ''మహా వీరుడా, నన్ను మీ బంటుగా వెంట తీసుకుపొండి. ఈ నాటినుంచీ నేను తమ సేవకుణ్ణి!'' అన్నాడు.

ఆ మాటలకు సిద్ధసాధకుడు ఉప్పొంగి పోయి, ''ఒరే, జలవృకా, లెస్స పలికావు! నా నరవానరం అంత వేగంగా నన్నను సరించి రాగలవా?'' అన్నాడు.

''దొరా, నాకు రెక్కలొకటే తక్కువ, అయినా నేలమీద ఆకాశంలోని పక్షి అంత వేగంగానూ పరిగెత్తగలను,'' అన్నాడు జలరాక్షసుడు.



"ఆహాఁ, మెచ్చదగిన మాటరా, సేవకా!" అంటూ సిద్ధసాధకుడు, జల రాక్షసుడి భుజంతట్టి, నరవానరాన్ని అదిలించబోయేంతలో అక్కడికి, మరుగుజ్జుసేనాని కొందరు అనుచరులతో కలిసి పొటేళ్ళ వాహనాల మీద వచ్చాడు.

"ఓహోఁ, వీర మరుగుజ్జు సేనానా! ఏమిటీ విశేషం?" అని అడిగాడు సిద్ధసాధకుడు.

మరుగుజ్జుసేనాని, నది ఒడ్డున గాయపడి గిలగిల్లాడుతున్న జలవృక రాక్షసులను సాధకుడికి చూపుతూ, "దొరా, యిక్కడ జరిగినదంతా మేమూ గుట్టచాటున వుండి చూశాం. ఈ తోడేలు తలల మనుషుల్ని ఏం చేయ మన్నారు? వీళ్ళనిలా చికిత్స లేకుండా చావనివ్వటం ధర్మంకాదు గదా?" అన్నాడు.

"మంచి మాట పలికావు! ఆ దుర్మార్గుల్ని చికిత్స చేసే పరలోకానికి పంపు. కాని జాగ్రత్త, కాస్త ఊపిరీ, శక్తీ రాగానే వాళ్లు మిమ్మల్ని పట్టుకుతినేసే ప్రమాదం వున్నది," అన్నాడు సిద్ధసాధకుడు.

సిద్ధసాధకుడు మాట ముగించే లోపలే, మరుగుజ్జుసేనాని నదికి అవలివైపునున్న అరణ్యం కేసి ఆశ్చర్యంగా చూస్తూ, "దొరా, అటుకేసి చూడండి! ఆకాశాన్నంటుతున్న ఆ తెల్లని పొగ ఏమిటి? మహారణ్యం నిలువునా కాలిపోతున్నదా?" అన్నాడు.

"అరణ్యం కాలటం కాదు; ఆ పొగకు కారణం అయిన మంటల్లో మాయా సరోవరేశ్వరుడనే దుర్మార్గుడి శరీరం, సజీవదహనం అవుతున్నది! నరవానరా, ఆ లేస్తున్న పొగకేసి వాయువేగంతో పరిగెత్తు," అంటూ సిద్ధసాధకుడు వానరాన్ని అదిలించాడు.

నరవానరం అరణ్యం ప్రతిధ్వనించేలా ఒక కేకపెట్టి, వేగంగా బయలుదేరింది. దాని వెనకగా జలవృకరాక్షసుడూ, ఏనుగు జలగ్రహం మీద మకరకేతుడూ కదిలారు. —(ఇంకావుంది)






# దరిద్రుని వాక్కు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, మహత్తరశక్తులు సాధించటానికే నువు ఇలా శ్రమపడుతున్నపక్షంలో అలాటి శక్తులు తపస్సు ద్వారానూ, యోగం ద్వారానూ మాత్రమే వస్తాయని భయపడకు. అవి అతిసామాన్యమైన పేదవాడిలోకూడా ఉండవచ్చు. అందుకు నిదర్శనంగా, ఒక లక్షాధికారి జీవితాన్ని పూర్తిగా మార్చేసిన దరిద్రుడి కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒక గ్రామంలో ఒక దరిద్రుడు ఉండేవాడు. వాడికి నా అన్న వారెవరూ లేరు. వాడు రోజూ ఆ ఊరి చెరువులో స్నానం

## బేతాళ కథలు



ఏడాది లోపల ఆమె కొడుకును కంటుంది," అన్నాడు.

సంతానం విషయంలో ఎవరి ఆశీర్వచనమైనా స్వీకరించటానికి సిద్ధంగా ఉన్న లక్షాధికారి ఆ అరటిపండును తన భార్య కిచ్చి, తినమన్నాడు. ఆమె సంవత్సరం తిరిగే లోపుగా కొడుకును కన్నది.

అదంతా దరిద్రుడి మహిమగా భావించి, లక్షాధికారి శివాలయానికి వచ్చి, దరిద్రుణ్ణి చూశాడు.

."పిల్లవాడు ఏడుస్తున్నాడా ?" అని అడిగాడు దరిద్రుడు.

లక్షాధికారి దరిద్రుణ్ణి పొగడి, "మీ మహిమవల్ల నాకు పుత్రప్రాప్తి కలిగింది. నాకు శక్తి ఉన్నంతలో మీరు ఏది కోరినా ఇస్తాను. కోరుకోండి," అన్నాడు.

"నా కేమీ వద్దు. నువు అక్రమంగా లోకుల సొత్తు స్వాధీనం చేసుకుని, వాళ్ళను దరిద్రులనుచేసి, దొంగవ్యాపారమూ, దారుణమైన వడ్డీలూ, అబద్ధపు పత్రాల సృష్టి మొదలైన ఘోరాలు చేశావు. అలాటి వ్యాపారాలు మానుకో, నీ బిడ్డ క్షేమంగా ఉంటాడు. లేకపోతే నీ కర్మ !" అన్నాడు దరిద్రుడు.

లక్షాధికారి నెత్తిన పిడుగు పడ్డట్టయింది. అతను లోగడ అక్రమంగా

చేసి, పక్కనే ఉన్న శివాలయంలో చేరేవాడు. శివాలయానికి వచ్చే భక్తులు రోజూ వాడి ముందు కొబ్బరి చిప్పలూ, అరటి పళ్ళూ, చిల్లర డబ్బులూ వేసేవాళ్ళు. వాడు దొరికిన రోజు తిని, దొరకనప్పుడు పస్తు ఉండేవాడు తప్ప ఎవరినీ ఎన్నడూ యాచించేవాడు కాడు.

ఒకరోజు ఒక లక్షాధికారి తన భార్యతో సహా శివుడికి అర్చన చేయించటానికి వచ్చాడు. వారికి సంతానంలేదు. లక్షాధికారి దరిద్రుడి ముందు ఒక అరటిపండు వేశాడు. దరిద్రుడు దాన్ని తీసుకుని, ఏదో ఆలోచించి, లక్షాధికారికి పండును తిరిగి ఇస్తూ, "దీన్ని నీ భార్యను తినమను.

స్వాధీనపరుచుకున్న ఆస్తులు ఎవరివి వారికి ఇచ్చేసి, అధిక వడ్డీలు పుచ్చుకున్న వారికి డబ్బు తిరిగి ఇచ్చి, దొంగవ్యాపారాలు కట్టిపెట్టి, న్యాయంగా వ్యాపారం చేస్తూ, తేలికపడిన మనస్సుతో జీవించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, దరిద్రుడి వాక్కుకు అలాటి మహిమ ఎలా వచ్చింది? అతను తన కాలమంతా శివాలయంలో ఉంటూ, దేవుడి ప్రసాదం మీద బతుకుతూ ఉండటంవల్లనా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీతల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దరిద్రుడిలో మహిమ ఉన్నదనుకునేటందుకు ఆధారం లేదు. వాడు అన్నమాటలన్నీ నిజమైతే ఆ ఊరి వాళ్లు వాణ్ణి ఎప్పుడో అందలం ఎక్కించి ఉందురు. అయితే నిస్వార్థంగా జీవించేవాడి మాటలు ఒక్కొక్కసారి నిజమవుతాయి. లక్షాధికారికి కొడుకు పుట్టడం అలాటిది. అయితే లక్షాధికారి ఆ దరిద్రుడిలో మహిమ ఉన్నదని ఎందుకు అనుకున్నాడంటే ఎన్నోవేల దంపతులు ఎన్ని నోములు నోచినా, ఎన్ని తీర్థయాత్రలు చేసినా, ఎంతో మంది దేవుళ్ళకు మొక్కినా పిల్లలను కనలేక, ఏ సాధువో ఇచ్చిన పండు తిని పిల్లలను కంటారు. ఆ సాధువులు నిజంగా మహిమగల వాళ్ళే. ఆ లెక్క ప్రకారం ఈ దరిద్రుడికీ మహిమ ఉండాలని లక్షాధికారి అనుకున్నాడు. అతని నమ్మకం అంతదాకా వచ్చినాక, లేక లేక పుట్టిన పిల్లవాడి క్షేమంకోసం విధిగా తన జీవిత విధానమంతా మార్చుకోక తప్పలేదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# మేకుల గుర్తులు

రాజు చాలా అల్లరివాడు. అన్నీ పాడుపనులు చేసేవాడు. తండ్రి వాణ్ణి తిట్టీ, కొట్టీ మార్చలేకపోయాడు. వాడిమీద ఫిర్యాదు వచ్చినప్పుడల్లా పూజామందిరం తలుపులో ఒక మేకు కొట్టుతూ వచ్చాడాయన. కొంతకాలానికి తలుపు అంతా మేకులతో నిండిపోయింది.

అకస్మాత్తుగా రాజులో పరివర్తన వచ్చింది. వాడు చెడ్డపనులు చెయ్యటం మానటమే కాక అందరికీ సహాయంచేస్తూ మంచిపనులు చేయసాగాడు. వాడు ఒక్కొక్క మంచిపని చేసినప్పుడల్లా తండ్రి తలుపునుంచి ఒక్కొక్క మేకు లాగెయ్యసాగాడు. సంవత్సరంలోపల మేకులన్నీ తలుపునుంచి వచ్చేశాయి.

చివరి మేకు తలుపునుంచి లాగేసిన రోజున రాజు ఏడుస్తూ, తండ్రి కాళ్ళమీద పడి, "నాన్నా, మేకులైతే తీసేశావు గాని, వాటి గుర్తులు తలుపుమీద శాశ్వతంగా ఉండిపోయాయి!" అన్నాడు.

"అవును, నాయనా. చెడ్డపనులు మానినా వాటి వాసన వదలదు. అందుచేత చెడ్డపనులు చెయ్యకుండానే ఉండాలి," అన్నాడు తండ్రి.

ఎం. ఆర్. కె. నాయర్.






కుబేరుడు అనే యువకుడికి అష్టఐశ్వర్యాలూ ఉన్నాయిగాని ఆరోగ్యం లేదు. తన ఆరోగ్యం చక్కబడడానికి ఎన్నో మందులు సేవించాడుగాని, లాభం కలగలేదు. అందుచేత అతను ఎప్పుడూ దిగులుగా ఉండేవాడు.

కుబేరుడి మిత్రుడు చరకుడు అనేవాడు ఏదో పనిమీద వచ్చి, కుబేరుడి ఇంట బసచేశాడు. అతను తన మిత్రుడి అనారోగ్యం గురించి విచారించాడు. అతను పెద్ద ఘనవైద్యుడు కాకపోయినా, గృహవైద్యం తెలిసినవాడు. అతను కుబేరుణ్ణి తనకు తెలిసినమేరకు పరీక్షించి, అతని శరీరంలో ఏ దోషమూ లేదని తెలుసుకున్నాడు. చరకుడు కుబేరుడి దినచర్య గురించి ప్రశ్నించాడు.

కుబేరుడు ఉదయం కాలకృత్యాలు తీర్చుకుని ఫలహారం చేస్తాడు. తరవాత కొంతసేపు తమ ఆస్తికి సంబంధించిన లెక్కలు చూస్తాడు. మధ్యన పళ్ళరసం తీసుకుంటాడు. తరవాత కాస్సేపు విశ్రాంతి తీసుకుని భోజనం చేస్తాడు. భోజనంచేసి నిద్రపోతాడు. నిద్ర అయాక తమ వ్యవహారాలు చూసే ఉద్యోగుల మీద అజమాయిషీ చేసి, తన తండ్రితో సొంత వ్యవహారాలను గురించి చర్చిస్తాడు. రాత్రి భోజనం అయాక, పడుకునేముందు మళ్ళీ పళ్ళరసం తాగుతాడు.

కుబేరుడు ఈ వివరాలన్నీ చెప్పి, చరకుడితో, ''నన్నేదో భయంకరమైన వ్యాధి పట్టుకున్నది. అది మందులకు లొంగేదికాదు. పళ్ళరసం నోటికి బాగుండదు. భోజనం హితవుగా ఉండదు. నా జీవితం ఇలా గడచి

''వసుంధర''



పోవలసిందేగదా అని నిరుత్సాహంగా ఉంటుంది," అన్నాడు.

చరకుడు నవ్వి, "నిరుత్సాహపడకు. నీకు ఔషధాలతోబాటు గాలి మార్పు కూడా అవసరం. ఒక మాసంపాటు మా ఊరు వచ్చి ఉండు. నీ ఆరోగ్యం బాగుపడుతుందని నా నమ్మకం," అన్నాడు.

కుబేరుడు తండ్రి అనుమతితో చరకుడి ఊరు వెళ్ళాడు. ఆ గ్రామంలోని సంపన్నులు కళాప్రియులు. అందుచేత అక్కడ నిత్యమూ వినోద కార్యక్రమాలు జరుగుతూ ఉండేవి. కుబేరుడికి ఆ కార్యక్రమాలు అమితమైన ఆనందం కలిగించాయి. అందుచేత అతను రోజూ సాయంకాలం కోసం ఆత్రంగా ఎదురుచూసేవాడు.

అతనిలో కొత్త ఉత్సాహం చూసి చరకుడు, "మా ఊరి గాలి నీకు పడినట్టున్నది. నీలో ముందు లేని ఉత్సాహం కనబడుతున్నది. నిన్నరాత్రి నాకు ఒక గోసాయి కనిపించాడు. అతనికి నీ జబ్బు గురించి చెబితే, అడవిలో కోయగూడెం సమీపంలో ఒక మూలిక ఉన్నదనీ, దాన్ని వాడేవాడే స్వయంగా పీకాలనీ, ఆ మూలికతో నీ వ్యాధి నయమవుతుందనీ అన్నాడు. నీకు అభ్యంతరం లేకపోతే ఇప్పుడే బయలుదేరి వెళ్ళివద్దాం," అన్నాడు.

"సాయంత్రానికల్లా తిరిగి రాగలమా?" అని కుబేరుడు అడిగాడు.

"ఎందుకు రాలేం? ప్రయాణం కొద్దిగంటలే పట్టుతుంది," అన్నాడు చరకుడు.

మిత్రులిద్దరూ అడవిలో కాలిబాటల వెంట నడుస్తూ వెళ్ళారు. చరకుడు చకచకా నడిచేస్తున్నాడుగాని, కుబేరుడు నడవలేక మధ్యమధ్య ఆగిపోతున్నాడు.

"నా వయసు వాడివేగదా, నాతోబాటు నడవలేక పోవడమేమిటి?" అన్నాడు చరకుడు.

''నా ఆరోగ్యం సరిగా ఉంటే నేనూ నడుద్దును,'' అన్నాడు కుబేరుడు.

''నీ ఆరోగ్యం గురించే గద పోతున్నాం? త్వరగా పోకపోతే తిరిగి త్వరగా రాలేం,'' అన్నాడు చరకుడు.

ఆ మాట వినేసరికి కుబేరుడు పట్టుదలగా చరకుడి వెంట నడిచాడు. ఇద్దరూ చాలాదూరం నడిచి వెళ్లాక, చరకుడు ఒక మొక్కను చూపి, "ఇదే మూలిక! నీ చేత్తోనే పెకలించు," అన్నాడు.

కుబేరుడు ఆ మొక్కను రెండు చేతులా పట్టి లాగితే, వేరుతోసహా వచ్చింది. దాన్ని సమీపంలో ఉన్న కొలనులో శుభ్రంగా కడిగినమీదట, చరకుడు దాని వేరును కుబేరుడి చేత తినిపించి, ''ఇక మనం వెనక్కు వెళ్ళవచ్చు,'' అన్నాడు.

తాము వచ్చిన దూరమంతా తలచుకునేసరికి కుబేరుడి గుండెల్లో రాయి పడినట్టయింది. పైగా అతనికి ఆకలిగా ఉన్నది. "మిత్రమా, నాకు ఆకలి మండిపోతున్నది. అడుగు తీసి అడుగు వెయ్యలేను. తినడాని కేమైనా కావాలి," అన్నాడు కుబేరుడు నీరసంగా.

''అప్పుడే ఔషధం పనిచేస్తున్నదన్నమాట. ఈ సంగతి తెలిస్తే, వెంట తినడాని కేమైనా తెచ్చేవాణ్ణే. ఇప్పుడైనా మించిపోయిందేమీలేదు. దగ్గిరలోనే కోయగూడెం ఉన్నది. అక్కడ తినడానికి



ఏదైనా దొరక్కపోదు,'' అన్నాడు చరకుడు.

కోయగూడెం అంత దగ్గరలో ఏమీ లేదు. అయినా గత్యంతరం లేక కుబేరుడు అక్కడిదాకా నడిచాడు. కోయదొర వారికి స్వాగతం చెప్పి, అప్పటికప్పుడు వెదురుబియ్యం వండించి పెట్టాడు. ఆకలి కరకర లాడుతూంటే, తాను ఏమి తింటున్నదీ తెలీకుండానే కుబేరుడు ఆవురావురని తినేశాడు.

భోజనం అయాక ఇద్దరికీ నిద్ర వచ్చింది. కోయదొర వాళ్ళకు పడకలు ఏర్పాటుచేశాడు. వాళ్లు నిద్రలేచేసరికి సాయంకాలం కావస్తున్నది. ఇద్దరూ ఇంటికి వచ్చేటప్పుడు కుబేరుడు, ''నీ మందు అద్భుతం! నాకు మంచి నిద్ర పట్టింది. ఒంట్లో చ్చాలా సుఖంగా ఉన్నది," అని చరకుడితో అన్నాడు.

ఆ రాత్రి కూడా కుబేరుడు కడుపు నిండా తిని, ఒళ్ళు తెలియకుండా నిద్రపోయాడు.

మర్నాడు చరకుడు అతనితో, ''నీ ఆరోగ్యం చక్కబడింది గనక అసలు విషయం చెబుతాను. ఆకలి పుట్టడానికి ఉపవాసం తప్ప మరో మందు లేదు. నిద్రపట్టడానికి శరీరశ్రమ తప్ప మరో మార్గంలేదు. మనసు ఉల్లాసంగా ఉండాలంటే వినోద కార్యక్రమాలు అవసరం. ముందే ఈ మాట చెబితే నువు నమ్మవని, మందు పేరు చెప్పి ఇలా తీసుకొచ్చాను. ఇకముందు ఆకలి వేస్తేనేగాని తినకు. శరీరవ్యాయామం కొంత అయినా చెయ్యి,'' అన్నాడు.

కుబేరుడు ముందు ఆశ్చర్యపడినా తరవాత నిజం గ్రహించి, తన ఊరికి తిరిగి పోయి, చరకుడి సలహాను అమలు చేస్తూ వచ్చాడు. తమ గ్రామంలో అతనే వినోద కార్యక్రమాలు కూడా ఏర్పాటు చేశాడు.





# స్నేహధర్మం

భూపతికి బోలెడంత పొలమూ, లంకంత ఇల్లూ ఉన్నాయి. అతని ఏక పుత్రుడు గజపతి.

ఒకసారి తండ్రి కొడుకు లిద్దరూ రాజధానిలో జరిగే ఉత్సవాలు చూడ బోయారు. రెండురోజులపాటు నగర వైభవాన్నీ, ఉత్సవాల సంరంభాన్నీ చూసి, మూడోరోజు ఒక పెద్ద భవంతి ముందుకు వచ్చి, నగరంలో అలాటి భవంతి మరొకటి లేదనుకున్నారు. అది ఎవరిదని దారేపోయేవాణ్ణి అడిగితే, మాణిక్యవర్మ అనే ధనవంతుడిదని తెలిసింది.

''నాతో బంగారం పంచుకున్న మాణిక్యవర్మ కాడుగద!'' అని భూపతి పైకే గొణిగాడు.

గజపతికి ఆ మాట వినపడనే వినపడింది.

''ఎవరు నీతో బంగారం పంచుకున్న మాణిక్యవర్మ ?'' అని అతను తండ్రిని అడిగాడు. భూపతి ఇలా చెప్పాడు :

చిన్నతనంలో భూపతి బొత్తిగా దిక్కు లేనివాడు, ఎవరికి పడితే వారికి చిల్లర పనులు చేసిపెట్టి, వాళ్ళిచ్చే డబ్బులతో పొట్టపోసుకునేవాడు. మాణిక్యవర్మ భూపతికి మంచి స్నేహితుడు. ఊరి చివర పాడుపడిన భవనం ఒకటి ఉండేది. అది ఒక జమీందారుది; పిడుగుపడి కూలిపోయింది. జమీందారు కుటుంబం అందరూ చచ్చిపోయారు. ఒక్క జమీందారు తండ్రి మాత్రం బతికాడు. అతను ఆ సమయానికి ఊళ్ళో లేడు. తిరిగివచ్చి జరిగినది చూడగానే అతనికి మతిపోయింది.

ఆ వృద్ధుడు తరవాత కొంతకాలం బతికాడు; ఎప్పుడైనా ఊళ్ళోకి వచ్చి,

మాచిరాజు కామేశ్వరరావు

కుర్రవాళ్ళతో, "మీకు బంగారం కావాలి రా?" అని గట్టిగా కేకలు పెట్టేవాడు. అతన్ని చూసి కుర్రవాళ్ళు భయపడేవాళ్ళు, ఒక్కొసారి దూరంనుంచి అతనిమీద రాళ్లు వేసేవాళ్లు.

భూపతీ, మాణిక్యవర్మా మాత్రం ఆ పిచ్చివాడిపట్ల స్నేహంగా ఉండేవాళ్లు. అప్పుడప్పుడూ ఆ కూలిపోయిన భవనానికి పోయి, ముసలివాడితో కబుర్లు చెప్పేవాళ్లు. ఒకరోజు వాళ్లు వెళ్ళేసరికి, ముసలివాడు చావు బతుకుల్లో ఉన్నాడు. ఇద్దరూ యింత నీరు తెచ్చి అతని గొంతులో పోశారు.

ముసలివాడు గుటకలు వేసి, "పిల్లలూ, పెరట్లో వేపచెట్టు మొదట్లో బంగారం ఉంది, తవ్వి తీసుకోండి!" అని ప్రాణం వదిలాడు.

కొద్దిరోజులు గడవ నిచ్చి, భూపతీ, మాణిక్యవర్మా చెట్టు మొదట్లో కాస్త, కాస్తగా తవ్వసాగారు. పదిరోజులు తవ్వినాక, పాతకాలపు బిందె కనబడింది. దాని నిండా బంగారు నాణాలున్నాయి. వాటిని స్నేహితులిద్దరూ సమంగా పంచుకున్నారు.

తనవంతు బంగారంతో మాణిక్యవర్మ నగరంలో వ్యాపారం చేయ నిశ్చయించాడు. భూపతి పల్లెప్రాంతానికి పోయి భూములు కొని, భూస్వామిగా బతకాలని నిశ్చయించాడు. స్నేహితులిద్దరూ విడిపోయి, తిరిగి కలుసుకోలేదు.



తాము చూసిన ఇల్లు ఆ మాణిక్యవర్మ దేనని త్వరగానే తెలిసిపోయింది. మాణిక్యవర్మ భూపతిని చూసి గుర్తు పట్టి, నౌకరును పంపి లోపలికి పిలిపించాడు.

తండ్రి కొడుకులిద్దరూ ఇల్లంతా తిరిగి చూసి, అమిత ఆశ్చర్యపడ్డారు. గజపతికి ఆ ఇంటి వైభవం చూసినాక తండ్రిమీద చాలా కోపం వచ్చింది. ''నాన్నా, నువు నాకు తీరని అన్యాయం చేశావు. నువు కూడా వ్యాపారం చేసి ఉంటే మనం కూడా ఇంత హాయిగానూ ఉందుము. మన జీవితం తలుచుకుంటే రోత పుట్టుతున్నది.'' అంటూ బయటికి వెళ్ళిపోయాడు.

కొడుకు చేత అంతమాట అనిపించు కున్నందుకు భూపతి బాధపడ్డాడు. మాణిక్యవర్మ అతన్ని చూసి, ''అలా ఉన్నావేం?'' అని అడిగితే భూపతి తన కొడుకు అన్నమాట చెప్పాడు.

''తెలియనితనం! నువ్వేమీ బాధ పడకు,'' అని మాణిక్యవర్మ భూపతికి భోజనం పెట్టించి, విశ్రాంతి సదుపాయం చేశాడు.

కొద్దిసేపటికి గజపతి ఎర్రబడిన కళ్ళతో, చెరిగిన జుట్టుతో, ఇంటికి తిరిగి వచ్చాడు.

మాణిక్యవర్మ అతన్ని కూడా భోజనానికి కూర్చోబెట్టి, అలా ఉన్నా వేమని అడిగాడు.



''మా నాన్న నాకు తీరని అన్యాయం చేశాడు. మీతోపాటే ఆయన కూడా నగరంలో వ్యాపారం చేసి ఉంటే, మేం కూడా మీలాగే హాయిగా ఉండేవాళ్ళం.'' అన్నాడు గజపతి.

మాణిక్యవర్మ నవ్వి, ''అలా ఎన్నటికీ అనుకోకు. మీ నాన్న చేసిన నిర్ణయం ముందు చూపుతో కూడినది. వ్యాపారమంటే జూదం. ఓడలు బళ్లు కావచ్చు, బళ్లు ఓడలు కావచ్చు. నా వంతు బంగారంతో మా అన్నను కూడా వ్యాపారం చెయ్యమన్నాను. కాని అతనికి ఇష్టం లేకపోయింది. నా దగ్గిర ఉన్న బంగారంలో సగం తీసుకుని, ఓడ వ్యాపారం సాగించాడు. నడిసముద్రంలో ఓడ మునిగి, సరుకంతా పోయింది. నా దగ్గిర మరికొంత బంగారం తీసుకుని కలప వ్యాపారం సాగించాడు. అగ్ని ప్రమాదంలో అతని కలప అంతా కాలి బూడిద అయిపోయింది. నేను చేసిన వ్యాపారం నాకు బాగా కలిసి వచ్చింది. వ్యవసాయంలాగా కాదు, వ్యాపారానికి స్వయం కృషికన్న అదృష్టం కలిసి రావటం ముఖ్యం. ఇవాళ కుబేరుడుగా ఉన్నవాడు రేపు బికారి కావచ్చు. వ్యాపారం చేసేవాడికి చింత తప్ప, సంసార సుఖం కూడా ఉండదు. నీ జీవితంలో ఎలాటి సమస్యలూ లేవంటే అది మీ నాన్న చలవే!" అన్నాడు.

గజపతికి కను విప్పు కలిగింది. అతను తన అజ్ఞానానికి ఎంతగానో సిగ్గు పడ్డాడు.

మర్నాడు భూపతి మాణిక్యవర్మతో, ''నువు మా వాడికి మీ అన్న గురించి చెప్పావుటగదా? ఎవరా అన్నయ్య? నే నెన్నడూ ఎరగనే?" అన్నాడు.

''నీ పట్ల స్నేహధర్మాన్ని బట్టి ఒక చిన్న కట్టుకథ అల్లి చెప్పాను. మీ వాడి మనసు మారినట్టే ఉంది." అన్నాడు మాణిక్యవర్మ.





# సమ ఉజ్జీలు

పూర్వం అవంతీ రాజ్యాన్ని పాలించిన ధీరదత్తుడు ఆదర్శపాలకుడు. అతని రాజ్యంలో చోరభయం మచ్చుకైనా ఉండకుండా తగిన కట్టుదిట్టాలు ఉండేవి. ధీరదత్తుడి కొడుకు రాజశేఖరుడు. ధీరదత్తుడు ముసలివాడైపోయి, తాను బతికి ఉండగానే తన కొడుకుకు పట్టం కట్టాడు.

పట్టాభిషేకం జరిగే ముందురోజు రాజశేఖరుడికి ఒక విషయం ఆశ్చర్యంగా తోచింది. తమ రాజ్యంలో చిన్న దొంగతనాలు కూడా ఎందుకు లేవు ? అవిలేకుండా తన తండ్రి తీసుకుంటున్న చర్య లేమిటి ? ఇది తెలుసుకునేటందుకు తాను దొంగతనం చెయ్యాలనుకుని, అతను ఒకరాత్రి మారు వేషంలో ఒక ధనికుడి ఇంట ప్రవేశించి, అతని సొత్తు కొంత దొంగిలించి, బయటపడి, తన ఇంటికి బయలుదేరాడు.

అతను చీకటిలో చప్పుడు చెయ్యకుండా వెళుతుండగా, ఎవరిదో బలమైన చెయ్యి అతనిమీద పడింది. అతను వెనుతిరిగి చూస్తే, ఒక దొంగలాటి మనిషి కనబడి, ''చప్పుడు చెయ్యకు, పహరావాళ్ళు ఉన్నారు. నేనూ దొంగనే,'' అన్నాడు రహస్యంగా.

రాజశేఖరుడికి దివ్యమైన ఆలోచన వచ్చింది. తనకే ఒక దొంగ దొరికాడు! వాణ్ణి ఖైదు చేయించి, తన తండ్రికన్న తానే సమర్థుడనిపించుకోవాలి.

''నా పేరు వీరభల్లుడు. నా స్థావరానికి వచ్చి, నువు దొంగిలించిన దానిలో నా వాటా నాకిచ్చి నీ దారిన నువు వెళ్ళు,'' అన్నాడు దొంగ.

పోలిశెట్టి వేణుగోపాలరావు



ఇద్దరూ కలిసి నగరం పొలిమేరలో ఉన్న రెండు పెద్ద గుహలు చేరారు. వీరభల్లడు రాజశేఖరుణ్ణి ఒక గుహలోకి తీసుకుపోయాడు. కాగడా వెలుతురులో రాజశేఖరుడికి గుహ గోడల మీద కత్తులూ, ఇతర ఆయుధాలూ కనిపించాయి గాని, వీరభల్లడి అనుచరుడు ఒక్కడూ కనిపించలేదు.

రాజశేఖరుడు అతన్ని, "నీకు అనుచరులు లేరా?" అనేసరికి, వీరభల్లడు చప్పట్లు కొట్టాడు. వెంటనే రెండో గుహనుంచి ఇరవైమంది రక్షకభటులు వచ్చి, రాజశేఖరుణ్ణి బంధించారు. అతను నివ్వెరపోయాడు.

వీరభల్లడు నవ్వి, "చోర యువకుడా, నా రాజ్యంలో దొంగతనం చెయ్యటం అంత సులువు అనుకున్నావా? నిన్ను రెండు రోజులలో బహిరంగంగా విచారించి, శిక్ష ఇస్తాను," అన్నాడు.

అది తన తండ్రి గొంతేనని గ్రహించి రాజశేఖరుడు సంతోషించాడు. ఆయన తనను ఎలా విచారణ చేస్తాడో, ఏ శిక్ష విధిస్తాడో తెలుసుకోవాలన్న ఉద్దేశంతో అతను తన నిజరూపం తండ్రికి తెలియనియ్యలేదు. రాజభటులు అతన్ని కారాగృహానికి తీసుకుపోయి బంధించారు. తన మిత్రుడైన కారాగృహాధికారికి తానెవరో చెప్పి, రాజశేఖరుడు తన దొంగవేషం విప్పి, జైలునుంచి తన మందిరానికి వెళ్ళిపోయాడు.

తెల్లవారింది. ఆ రోజే రాజశేఖరుడి రాజ్యాభిషేకం. ఆ కార్యక్రమం విజయవంతంగా ముగియగానే, ధీరదత్తుడు తన కొడుకుతో, "ఏనాడూ లేనిది, నిన్న ఒక దొంగ పట్టుబడటం నన్ను కలవరపెడుతున్నది. కనక మన రాజ్యంలోని దొంగలను గురించి నువు ఇకముందు ఇంకా జాగ్రత్తగా ఉండటం అవసరం," అన్నాడు.

రాజశేఖరుడు ఆ మాటలు గుర్తుంచుకుని, ఆ రాత్రి తన గుర్రంమీద, నగర

మంతా తిరిగి, రక్షకభటులు అప్రమత్తులై ఉన్నారో, లేదో చూడటానికి బయలుదేరాడు.

అతను కొంతదూరం వెళ్ళేసరికి ఒక దొంగలగుంపు అకస్మాత్తుగా అతన్ని చుట్టుముట్టింది. రాజశేఖరుడు కత్తి దూసి, వారినుంచి తనను రక్షించుకునే ప్రయత్నం చేశాడు. ఇంతకాలమూ మచ్చుకైనా దొంగ అనేవాడు కనిపించని తమ రాజ్యంలో ఒక్కసారిగా ఇంత మంది దొంగలు కనబడటం, అది కూడా తాను రాజైన రోజునే జరగటం, అతనికి ఆశ్చర్యం కలిగించింది.

ఇంతలో ఎవరో ఒకవ్యక్తి గుర్రంమీద వచ్చి, కత్తిదూసి, దొంగల పైబడి, వారిని తరిమేశాడు. ఆ పారిపోయే దొంగలను పట్టుకోవాలని రాజశేఖరుడు వారివెంట పోబోయాడు.

కాని అతనికి సాయంవచ్చిన వ్యక్తి, ''రాజా, ఇక నీకు వాళ్ళు దొరకరు. వాళ్ళు మీ రాజ్యంలోనే ఉండరు!'' అన్నాడు.

రాజశేఖరుడు ఆ వ్యక్తితో, ''నువు ఎవరు ? మీది ఈ దేశం కాదా ? నువు ఈ సమయంలో నాకు ఎలా సహాయం వచ్చావు ?'' అంటూ ప్రశ్నలవర్షం కురిపించాడు.



''రాజా, మాది పొరుగుదేశం. మా దేశంలో బతకలేక, నేనూ, నా కొడుకూ కొన్ని నెలలక్రితం మీ దేశం వచ్చాం. నిన్నటి నుంచి నా కుమారుడు కనిపించటంలేదు. నేను వాణ్ణి వెతుక్కుంటూ వస్తూండగా, దొంగలు మిమ్మల్ని చుట్టుముట్టటం కనిపించింది. నిన్న మీ పట్టాభిషేకం చూశాను గనక మిమ్మల్ని గుర్తుపట్టాను. మీకు సహాయపడటం నా ధర్మం అనిపించింది,'' అన్నాడు ఆ మనిషి.

తన దేశంవాడు కాకపోయినా, తనకు అలా సహాయపడిన వ్యక్తిని సత్కరించడం తన ధర్మం అనుకుని, రాజ



శేఖరుడు తన ఉంగరం తీసి ఆ మనిషికి ఇస్తూ, ''రేపు ఉదయానే రాజసభకు వచ్చి, ఈ ఉంగరం చూపితే, నువు ఏది కోరినా సరే తప్పక ఇస్తాను,'' అన్నాడు.

మర్నాడు దర్బారు కిటకిటలాడుతున్నది. అందరూ వచ్చారు గాని, తన తండ్రి ఇంకా రాలేదని రాజశేఖరుడు గమనించి, కారణం గ్రహించలేక పోయాడు. ఇంతలో పరదేశీ ఉంగరంతో సహా వచ్చాడు.

రాజశేఖరుడు అతన్ని దగ్గిరికి రమ్మని, ''నీ కోరిక ఏమిటో చెప్పు, తీరుస్తాను,'' అన్నాడు.

''ప్రభూ, మొన్నరాత్రి నా కుమారుడు దొంగతనం చేస్తూ, మీ తండ్రిగారికి దొరికిపోయి కారాగారంలో ఉన్నాడట. దయచేసి వాడి తప్పు మన్నించి, వాణ్ణి వదిలిపెట్టండి. వాడు నాకు ఒక్కడే కొడుకు. మేం మా దేశం వెళ్ళిపోతాం," అన్నాడు పరదేశి.

రాజశేఖరుడు క్షణంపాటు నిస్తబ్ధుడు అయిపోయి, ఇలా ఆలోచించాడు: మొన్నరాత్రి దొంగతనం చేసినది తనే. మరొక దొంగతనం ఏదీ జరగలేదు. పట్టుబడి ఖైదులోపడిన తనను ''నా కొడుకే'' అని ఈ పరదేశీ అనటంలో అర్థం ఏమిటి? సభలో తన తండ్రి ఉంటే ఈ చిక్కును క్షణంలో విడగొట్టును!

రాజశేఖరుడు చప్పున తన సింహాసనం మీదినుంచి లేచి, తన నివాసానికి వెళ్ళిపోయాడు. సభికులకు జరిగినదంతా అయోమయంగా ఉన్నది.

అప్పుడు పరదేశి తన వేషం విప్పేసి, ధీరదత్త మహారాజుగా సభికుల ముందు నిలబడ్డాడు. వాళ్ళు హర్షధ్వానాలు చేశారు. ఆయన తన ఆసనంమీద కూర్చుని, సభికులు కోరిన మీదట, తానే తన కొడుకుకు ఈ పరీక్ష పెట్టినట్టు చెప్పాడు.

అంతలో రాజశేఖరుడు తాను మొదట ధరించిన చోరుడి వేషంలో సభకు వచ్చి, ''తండ్రీ, తమ రెక్కడ ఉన్నారు? వెళ్ళిపోదాం రండి. రాజుగారు మీ కోరికపై నన్ను యిప్పుడే ఖైదునుంచి విడుదల చేశారు,'' అని బిగ్గరగా అరిచాడు.

ఖైదీని చూడగానే ధీరదత్తుడు సింహాసనం మీదినుంచి లేచి, ''నిన్ను విడుదల చేసిన రాజుగారు ఎక్కడ?'' అని అడిగాడు.

పరదేశి తన తండ్రేనని ఆకస్మికంగా రాజశేఖరుడు గుర్తించి, ''చోర యువకుణ్ణి ఖైదులో నుంచి విడుదల చేసిన రాజును నేనే!'' అంటూ తన వేషం తొలగించాడు.

సభలో వర్ణనాతీతమైన కోలాహలం చెలరేగింది.

ధీరదత్తుడు తన కొడుకును ప్రేమతో కౌగలించుకున్నాడు.

''మీ పాలనలో సామర్థ్యం తెలుసుకోవాలని నేను చోరుడుగా నటించాను. నన్ను బంధించినది మీరేనని తెలిసి కూడా, మీ విచారణా, శిక్షా ఎలా ఉంటాయో తెలుసుకుందామని నేను బయటపడలేదు. మీరు ఎంత సమర్థతతో దేశాన్ని రక్షిస్తున్నారో గ్రహించాను. కాని మధ్యలో పరదేశి పాత్ర ఎలా వచ్చిందో నాకు అంతుపట్టలేదు,'' అన్నాడు రాజశేఖరుడు.

''నీ సూక్ష్మబుద్ధికి నేను చాలా సంతోషిస్తున్నాను. నీ శక్తి సామర్థ్యాలు పరీక్షించటానికి దొంగలు నీ మీద దాడిచేసినట్టు నేనే నాటకం ఆడించాను. చోర యువకుడి విషయంలో నీ నిర్ణయం ఎలా ఉంటుందో చూడటానికి, పరదేశిగా వచ్చి నిన్ను అలా కోరాను. పరదేశిని నేనని నువు గ్రహించనట్టే, చోరయువకుడివి నువేనని నేనూ తెలుసుకోలేకపోయాను,'' అన్నాడు ధీరదత్తుడు.

''తండ్రి కొడుకులు సమఉజ్జీలు! ఎవరికి ఎవరూ తీసిపోరు!'' అని సభికులు ప్రశంసించారు.



# దేవుడు అన్నం పెట్టడా?

ఒక గ్రామంలో రాముడూ, భీముడూ అని ఇద్దరు స్నేహితులు ఉన్నారు. భీముడికి ఎవరూ లేరు, కష్టపడి పనిచేసి పొట్టపోసుకునేవాడు. రాముడు పనిచేసేవాడు కాడు, తల్లి పెట్టితే తినేవాడు.

భీముడు రాముణ్ణి మందలించాడు. దేవుడే అన్నం పెడతాడు అన్నాడు రాముడు. కష్టపడనిదే దేవుడుకూడా అన్నం పెట్టడన్నాడు భీముడు.

దేవుడు తనకు అన్నం పెడతాడని రుజువుచెయ్యటానికి రాముడు ఒకరోజు భోజనం మాని కూర్చున్నాడు. భీముడు పక్కనే కూర్చున్నాడు. కొద్దిసేపటికి నిజంగానే ఒక పళ్లెం అన్నంతో సహా రాముడి ముందుకు వచ్చింది. వాడు దాన్ని అందుకోబోయాడు. అది వెనక్కు జరిగింది. రాముడు లేచి దాన్ని పట్టుకోబోయాడు. అది వాణ్ణి నానా తిప్పలూ పెట్టింది. రొప్పుతూ, చెమటలు దిగగారుతూ, రాముడు దానివెంట పరిగెత్తి, ఎలాగో పట్టుకున్నాడు.

"ఏంరా, దేవుడిచ్చిన అన్నం కూడా ఇంత శ్రమపడితేగాని దక్కలేదు?" అన్నాడు భీముడు రాముడితో!

—మైనొద్దీన్.





మాయాపూర్ సంస్థానం చుట్టూ మరి మూడు సంస్థానా లున్నాయి. అవి రత్నగఢ్, కుబేర్‌పురం, సింహభూమ్. ఈ మూడు సంస్థానాల ప్రభువులకూ మగ సంతులేదు, ఒక్కొక్క కూతు రున్నది. వారిపేర్లు నందినీ, లతికా, స్వప్నా. ముగ్గురూ వివాహయోగ్యమైన వయసులో ఉన్నారు.

మాయాపూర్ రాజైన దేవాశీష్‌కు కల్యాణ్ అని ఒకడే కొడుకు. అతను బలపరాక్రమాలు కలిగిన యువకుడు. అందుచేత పరిసర సంస్థానాల పాలకులకు అతన్ని అల్లుడు చేసుకోవా లనిపించింది. వాళ్ళు కబురు పంపారు.

దేవాశీష్ సంకటంలో పడ్డాడు. ఆతను తన పొరుగు రాజ్యాలవారికి వ్యతిరేకంగా పోలేడు. వారు ముగ్గురూ తనకన్న బలవంతులే; కోపంవస్తే తనను చిత్తు చేయగలరు. రత్నగఢ్ సమస్య ప్రత్యేకించి క్లిష్టమైనది. మాయాపూర్‌కు అయువుపట్టులాంటి వర్తక మార్గం రత్నగఢ్ గుండా పోతుంది. అందుచేత రత్నగఢ్‌తో శత్రుత్వమంటే మాయాపూర్‌కు ఆత్మహత్యలాటిది. అది అలా ఉంచి, అందరు రాజకుమార్తెలూ సుందరులే అయినా, రత్నగఢ్ రాజకుమార్తె నందిని ముగ్గురిలోకీ అందకత్తె. రాజకుమారుడు కల్యాణ్‌కు ఆమె అంటే చాలా ఇష్టం. అతను లోగడ ఆమెను కలుసుకోవటం తటస్థించింది. నందినికి కూడా అతనంటే ప్రత్యేక ఆకర్షణ ఉన్నది.

ముగ్గురు రాజుల దూతలూ వెళ్ళిపోయాక దేవాశీష్ తన కొడుకుతో రహస్య సమాలోచన జరిపి, "మనకు వచ్చిన సమస్య ఎంత క్లిష్టమైనదో నీకు తెలిసే

ఏ. సి. సర్కార్, ఐంద్రజాలికుడు

ఉంటుంది. దీనికి ఒక్కటే పరిష్కారం ఉన్నది – ముగ్గురు రాజకుమార్తెలనూ ఒకేసారి పెళ్ళాడటం," అన్నాడు.

"అందుకు ఆ రాజులు ఒప్పుకుంటారనుకోను," అన్నాడు కల్యాణ్.

"అయితే ఏమిటి చెయ్యటం ?" అని తండ్రి అడిగాడు.

"మన నిర్ణయం తెలపటానికి కొంత వ్యవధి కోరండి. ఈ లోపల ఏదో మార్గం చూతాం," అన్నాడు కల్యాణ్.

ఆస్థాన ఐంద్రజాలికుడు రాజకుమారుడి ఆప్తమిత్రుడు. కల్యాణ్‌ను చూసి, "ఏం, మిత్రమా, ఎందుకంత విచారంగా ఉన్నావు ?" అని అడిగాడు.

కల్యాణ్ అతనికి సంగతి అంతా చెప్పి, తనకు నందిని మీద మనసు ఉన్న మాట కూడా తెలిపాడు

"అదా సంగతి ? ఒక్క దెబ్బకు రెండు పిట్టలను కొట్టాలనా నీ ఉద్దేశం ? నీకు రత్నగఢ్ రాజు సఖ్యమూ, నందినితో పరిణయమూ కావాలి, మిగిలిన రాజుల విరోధం రాకూడదు ! అవునా ?" అన్నాడు సోమనాథుడు నవ్వుతూ.

"నీ ఇంద్రజాలం ఏమైనా తోడ్పడేనా ?" అని కల్యాణ్ అతన్ని అడిగాడు.

"తెలివితేటలూ, ఉపజ్ఞా ఉండాలే గానీ, ఇంద్రజాలం పరిష్కరించలేని సమస్య అంటూ ఉండదు. ఇంతకూ



నీకు నందినితో పరిచయం ఉన్నదా ?" అని సోమనాథుడు అడిగాడు.

''అంత గాఢమైన పరిచయం లేదు గాని, కావాలంటే ఆమెను సంప్రతించ గలను," అన్నాడు కల్యాణ్.

''అవసరమైతే, మన పథకం పార గలందులకు నువు చెప్పినట్టు చేస్తుందా ?'' అని సోమనాథుడు అడిగాడు.

''నన్ను పెళ్ళాడగలందులకు ఆమె ఏం చెయ్యమన్నా చేస్తుందనుకుంటాను," అన్నాడు కల్యాణ్.

''అలా అయితే నీ సమస్య పరిష్క రించగలను,'' అని సోమనాథుడు ధైర్యంగా చెప్పాడు.

మర్నాడు కల్యాణ్ తన తండ్రిని కలుసుకుని, ''మనలాగే ముగ్గురు రాజులూ విధి నిర్ణయంలో విశ్వాసంగల వాళ్ళే గనక, నాకు వధువును నిర్ణయించ టానికి పూజలూ, కొంత తతంగమూ ఏర్పాటు చేద్దాం. అందుకుగాను కుంకుమ పరీక్ష ఒకటి ఉన్నది. మీరు ముగ్గురు రాజులనూ అలాటి పరీక్షకు ఒప్పుకునేలా చెయ్యండి,'' అన్నాడు.

అతను తండ్రికి తమ పథకం అంతా చెప్పేశాడు. రాజు చిరునవ్వు నవ్వి, తన పట్టపుటేనుగుమీద, సపరివారంగా వెళ్ళి ముగ్గురు రాజులనూ కలుసుకున్నాడు.

ఏర్పాటు ప్రకారం ముగ్గురు రాజులూ తమ కుమార్తెలనూ, బంధుమిత్ర



పరివారాన్నీ, పురోహితులనూ వెంట బెట్టుకుని, మాయాపూర్‌లోని పెద్ద దేవాలయం ఆవరణకు వేంచేశారు. ఆలయం చక్కగా అలంకరించి ఉన్నది. కల్యాణ్ పెళ్ళికొడుకు వేషంలో ఉన్నాడు. ముగ్గురు రాజకుమార్తెలూ పెళ్ళికూతుళ్ళ వేషాలలో ఉన్నారు. నందినీ, లతికా, స్వప్నా ఒక పక్కగా నిలబడితే కల్యాణ్ రెండో పక్క నిలబడ్డాడు.

గుడి అర్చకుడు దేవుడి పూజ పూర్తి చేసి, ఒక ఇత్తడి పళ్లెంలో నూనె కలిపిన కుంకుమ పెట్టుకుని బయటికి వచ్చాడు. ఆయన ముగ్గురు రాజకుమార్తెల అరచేతులూ శుభ్రమైన గుడ్డతో తుడిచి, గుప్పిళ్ళు గట్టిగా ముడుచుకోమన్నాడు. తరవాత ఆయన కల్యాణ్ అరచెయ్యి తుడిచి, దానిమీద కుంకం బొట్టుపెట్టి, ''ఈ ముగ్గురు కన్యలలో ఎవరు రాజకుమారుడికి భార్య కావాలని రాసిపెట్టి ఉన్నదో ఆ కన్య చేతికి ఈ కుంకం గుర్తు మారుతుంది,'' అంటూ కల్యాణ్ చేతిమీది కుంకాన్ని తుడిపేశాడు. తరవాత ఆయన రాజకుమార్తెలకేసి తిరిగి, ''తల్లులారా, మీరు మీ గుప్పిళ్ళను తెరిచి చూపండి,'' అన్నాడు.

లతిక, స్వప్నల అరచేతులు శుభ్రంగా ఉన్నాయి. నందిని అరచేతిలో మాత్రమే కుంకం గుర్తు ఉన్నది. ముగ్గురు రాజులూ ముందుకు వచ్చి నందినినీ, కల్యాణ్‌నూ ఆశీర్వదించారు. లతికా, స్వప్నా తమ ఆశాభంగాన్ని సహించి, తమ తండ్రులతోపాటు వివాహమహోత్సవంలో పాల్గొన్నారు.

నందిని అరచేతిలోకి కుంకుం మరక ఎలా వచ్చింది? ఆమె తన మధ్య వేలి గోరుమీద కుంకుమ పూసుకున్నది. అన్ని వేళ్ళకూ గోరింటాకు పెట్టుకుని ఉన్నందున రంగులో రంగు కలిసిపోయి చూసేవాళ్ళకు తెలియరాలేదు. చెయ్యి ముడుచుకున్నప్పుడు ఆ గోరును అరచేతిలోకి నొక్కింది. అప్పుడు కుంకుమ మరక అరచేతికి అంటింది. ఈ పని ఆమె చేత చేయించినవాడు కల్యాణ్.



# మాట నేర్పు

కిల్లంగేరి అనే దేశంలో రామశాస్త్రి అనే జ్యోతిష్కుడు ఉండేవాడు. అతనికి ఆస్థాన జ్యోతిష్కుడు కావాలని కోరిక కలిగింది. ఒకరోజు రాజుగారికి తన కోరిక తెలిపాడు

అయితే రాజుకు జ్యోతిషంలో నమ్మకం అంతగాలేదు. ఇలా జ్యోతిష్కులమని ఉద్యోగం కోరుతూ వచ్చిన వారిని ఆయన, "నేను మీకు ఉద్యోగం ఇయ్యదలిచానా, లేదా ? చెప్పండి," అని అడిగేవాడు. "ఇయ్యదలిచారు," అని వాళ్లు అంటే, "తప్పు! నేను ఉద్యోగం ఇయ్య దలచలేదు, వెళ్లండి," అనేవాడు.

"ఇయ్యదలచలేదు!" అంటే తమ జ్యోతిషానికే అవమానం గనక, ఆ మాట ఎవరూ అనేవారు కారు.

కాని మాటకారి అయిన రామశాస్త్రి మటుకు, "మీరు నాకు ఉద్యోగం ఇయ్యదలచలేదు," అన్నాడు.

"మీ మాట అబద్ధం అయింది. నేను మీకు ఉద్యోగం ఇయ్యదలిచాను. కాని మీ జోస్యం అబద్ధమయింది గనక వెళ్లిరండి!" అన్నాడు రాజు.

"నా జ్యోతిషం అబద్ధం కాలేదే. మీరు నాకు ఉద్యోగం ఇయ్యటంలేదు గదా! నా జ్యోతిషం నిజంగా అబద్ధం చేయాలంటే నాకు ఉద్యోగం ఇయ్యండి. లేదూ, జ్యోతిషం మాట అటుంచి, నాకు ఉద్యోగం ఇయ్యదలిచారు గనక ఇయ్యండి," అన్నాడు రామశాస్త్రి.

—కోలార్ కృష్ణయ్యర్





# కనువిప్పు

ఒక గ్రామంలో వెంకయ్య అనే రైతు ధాన్యంవ్యాపారం చేసేవాడు. అతని ముగ్గురు అన్నలూ వ్యవసాయం చేసి, డబ్బు వెనకవేసుకుని, మరికొంత పొలం కొనుక్కున్నారు. మరొకడు బాగుపడు తూంటే వెంకయ్య ఓర్చలేడు.

వెంకయ్య దగ్గిర గుమాస్తాగా ఉంటున్న సుబ్బయ్య వెంకయ్యతో, ''నువు ఇచ్చే జీతంతో నాకు జరుగుబాటు కావటంలేదు. నాకు కొంత డబ్బు అప్పు పెడితే, నేను కూడా ధాన్యం వ్యాపారం లోకి దిగి, నేను కొన్న ధాన్యంమీద కొద్ది మామూలు తీసుకుని, దాన్ని నీకే అమ్ముతాను. నువు లాభానికి అమ్ముకో," అన్నాడు.

ఈ మాట విని వెంకయ్య నవ్వి, ''నువు కూడా నా అంతవాడివి కావాలని ఉందా ? ఆ తరవాత నాకు గుమాస్తా పని ఎవరు చేస్తారు ?" అన్నాడు.

దానికి ఏమనాలో తెలీక సుబ్బయ్య ఊరుకున్నాడు.

ఒకరోజు వెంకయ్యా, సుబ్బయ్యా ఏటి అవతల గ్రామాలలో ధాన్యం కొనుగోలు చెయ్యటానికి వెళ్ళారు. అక్కడి దళార్లు, ''మీరు ఇక్కడే ఉండండి. మేము రైతుల వద్ద ధాన్యం బేరం చేసుకు వస్తాం. మాకు పుట్టికి నాలుగు రూపాయ లియ్యండి, చాలు,'' అన్నారు.

వెంకయ్య పకక్కన నవ్వి, దళార్లతో, ''మీరు కూడా నా అంత కావాలను కుంటున్నారా ? వద్దు, వద్దు. మీరు పడవ దగ్గిరికి బస్తాలు మోసేపని చూడండి,'' అన్నాడు. దళార్లు మండిపడ్డారు కాని, ఆ కూలి డబ్బులు కూడా రావేమో ననుకొని, పైకి ఏమీ అనలేదు.

వేమూరు వెంకయ్య

వెంకయ్య ఆ గ్రామంలో నాలుగు పడవలకు సరిపోయే ధాన్యం కొని, దాన్ని సుబ్బయ్యను పడవలలో వేసుకు రమ్మని, తాను ఇల్లు చేరుకున్నాడు.

రెండురోజుల తరవాత సుబ్బయ్య వెంకయ్య ఇంటికి వెళ్ళి, కంటనీరు పెట్టుకుంటూ, ఇంటి వసారాలో నిల బడ్డాడు. వెంకయ్య బయటికి వచ్చి, సుబ్బయ్య వాలకం చూసి, "ఎందుకు అలా ఉన్నావు ? ఏం జరిగింది ?" అని అడిగాడు.

"ఏం చెప్పమన్నారు ? ధాన్యం తెస్తూండిన నాలుగు పడవలూ, సుడిగాలి వచ్చి, నట్టేట మునిగిపోయాయి. మా పిల్లలు చేసుకున్న పుణ్యాన నేను ప్రాణాలతో బయటపడ్డాను," అన్నాడు సుబ్బయ్య.

ఈ మాట వినగానే వెంకయ్యకు గుండెలో రాయిపడినట్టయింది. అతను అప్పుతెచ్చి భారీఎత్తున వ్యాపారం చేస్తే, సరుకంతా నీటిపాలు అయిపోయింది.

అతను తన అన్నల వద్దకు వెళ్ళి, తన గోడు చెప్పుకున్నాడు. వాళ్ళు అతనితో, "తమ్ముడూ, నీకు అప్పుచేసి వ్యాపారం చెయ్యమని మేం చెప్పలేదు. ఉమ్మడి ఆస్తిలో నీ వాటా నువు తీసుకుని, ఏమైనా చేసుకో," అన్నారు.



తన ఇల్లూ, గొడ్డూ, గోదా అంతా అమ్మేసి, బాకీదార్లకు దామాషా ప్రకారం బాకీలు తీర్చి, వెంకయ్య దివాలా తీసినా, ఋణవిముక్తి పొందాడు.

నిలవ నీడలేని పరిస్థితిలో సుబ్బయ్య వెంకయ్యకు తన ఇంట ఆశ్రయం ఇచ్చాడు. వెంకయ్య భార్య, "గుడిసెల్లో తలదాచుకునే కర్మ నాకేం పట్టింది ?" అని పుట్టింటికి వెళ్ళిపోయింది.

"నాదీ నలుగురు పిల్లల కుటుంబం. మనం కూలిపనులకు పోతే తప్పు జరుగు బాటు కాదు," అని సుబ్బయ్య తన వెంట వెంకయ్యను ఒక తాపీ మేస్త్రీ వద్దకు తీసుకుపోయాడు. ఆ మేస్త్రీ

వాళ్ళిద్దరికీ తట్టలుమోసే పని ఇచ్చాడు.

వెంకయ్యకు ఈ పని బాధగా ఉండటమేగాక, గిట్టుబాటుగా కూడా కనిపించలేదు. అందుచేత అతను మేస్త్రీతో, ''నాకు కూడా మేస్త్రీ కావాలని ఉన్నది. ఇల్లు కట్టేపని నేర్పించు,'' అన్నాడు.

మేస్త్రీ పకపకా నవ్వి, "నువు కూడా నా అంతటివాడివై, నాకు పోటీ రావా లనుకుంటున్నావా? నీకు తట్ట మోసేపని ఉందిగా ?'' అన్నాడు.

వెంకయ్యకు, తాను ఇతరులను ఇలాగే అన్న సంగతి జ్ఞాపకం వచ్చి, కనువిప్పు కలిగింది.

కొద్దిరోజులకు వాళ్ళు కట్టుతున్న ఇల్లు పూర్తిఅయింది. వెంకయ్యకు తెలియకుండా సుబ్బయ్య అతని అత్తవారింటికి కబురు చేశాడు: వ్యాపారంలో వెంకయ్యకు చాలా లాభం వచ్చింది; కొత్త ఇల్లు కట్టుకున్నాడు; వెంకయ్య భార్య గృహప్రవేశానికి రావాలి!

వెంకయ్య భార్య వచ్చింది. సుబ్బయ్య వెంకయ్యనూ, అతనిభార్యనూ స్నానంచేయించి, పీటలమీద కూర్చోబెట్టాడు. పురోహితుడు వచ్చి, మంత్రాలు చదివాడు. వెంకయ్య బంధువులంతా వచ్చి, కట్నాలూ, కానుకలూ చదివించారు.

వెంకయ్యకు ఇదంతా అయోమయంగా ఉన్నది. అందరూ భోజనాలు చేశాక సుబ్బయ్య వెంకయ్య పక్కన కూర్చుని, ''ఈ ఇల్లు నీదే. నీ ధాన్యం నీటిపాలు కాలేదు. అయితే నువు మమ్మల్ని గురించి చాలా చులకనగా మాట్లాడావు. నీకు కనువిప్పు కలిగించాలని ఇలా చేశాను,'' అన్నాడు.

''నువు కూడా నా అంతటివాడివి కావాలి,'' అంటూ వెంకయ్య సుబ్బయ్యకు తన ఆస్తిలో సగం ఇచ్చేశాడు. అతనిలో మార్పుకు అన్నలు కూడా సంతోషించారు.





# పరోపకారి చిన్నడు

రామాపురం ప్రజలకు రెండు భయాలు ఒకేసారి పట్టుకున్నాయి. ఒకటి దొంగల భయం. రెండోది దయ్యాల భయం. ఒక పురాతన రాజభవనం ఊరికి ఒక పక్కగా ఉండేది. అందులో దయ్యాలు చేరాయని ఊరి ప్రజలు చీకటి పడినాక తమ ఇళ్ళనుంచి బయటికి రావటానికి భయపడేవాళ్ళు. ఇది దొంగలకు చాలా అనుకూలంగా ఉండేది.

ఈ రెండు పీడలతోనూ రామాపురం సతమతమవుతూండగా చిన్నడు తన కుక్కతోసహా ఆ ఊరు వచ్చాడు. చిన్నడికి సొంత మనిషిగాని, సొంత ఊరుగాని లేదు. వాడు ఊళ్ళవెంట తిరుగుతూ, ఆపదలో ఉన్న వారిని తన శక్తికొద్దీ ఆదుకుంటూండేవాడు. రామాపురం ప్రజలు పిరికివారైపోయి, మానసికంగానూ, ఆర్థికంగానూ బాధ పడుతున్నారని తెలియగానే వాడికి ఆ ఊరు వదిలిపోబుద్ధి కాలేదు.

వాడు దయ్యాల ఇంటనే మకాంపెట్టి, ఇల్లంతా పరిశీలించాడు. ఇల్లు చాలా పురాతనమైనది తప్పిస్తే, వాణ్ణిగాని, వాడి కుక్కనుగాని ఏ దయ్యమూ బాధించలేదు. ప్రజలలో దయ్యాల భయానికి, దొంగల విజృంభణకూ, ఏదో సంబంధం ఉన్నది. అందుచేత రెండు సమస్యలనూ ఒకేసారి పరిష్కరించాలని చిన్నడికి తోచింది.

మర్నాడు చిన్నడు గ్రామాధికారి ఇంటికివెళ్ళి, తాను దొంగల బెడద పోగొట్టుతాననీ, తాను చెప్పినట్టు చాటింపు వేయించమనీ అన్నాడు. అదేమంటే చీకటి పడినాక ఎవరూ బయటికి రాకూడదని. గ్రామం అంతటా తాను గస్తీ తిరిగి, బయట కనిపించిన

బూర్లె నాగేశ్వరరావు



వాడినల్లా దొంగగా అనుమానించి పట్టుకుంటానని వాడు గ్రామాధికారితో చెప్పాడు.

ఆ ప్రకారమే చిన్నడు తెల్లవార్లూ తన కుక్కతో సహా ఊరంతా గస్తీ తిరిగి, వీధిలో దొరికిన ప్రతివాణ్ణీ తీసుకుపోయి దయ్యాల భవనంలో బంధించి, తెల్లవారగానే విడిచిపెట్టుతూ వచ్చాడు.

ఇలా రోజూ ఇద్దరో, ముగ్గురో ఒకరాత్రి కాలమంతా దయ్యాల భవనంలో గడుపుతూ వచ్చారు.

చిన్నడి ఈ ప్రయత్నంవల్ల గ్రామానికి రెండందాలా మేలు జరిగింది. వాడు తెల్లవార్లూ గస్తీతిరగటంచేత దొంగల ఆట కట్టయింది. గ్రామస్థులు చాలామంది దయ్యాల భవనంలో దయ్యాలు లేవనీ, ఉన్నా అవి ఎవరి జోలికీ రావనీ తెలుసుకున్నారు.

అయితే చిన్నడు అడ్డమైనవాళ్ళనూ దొంగల కింద అనుమానించి పట్టుకుంటున్నాడని కొందరు గ్రామాధికారికి ఫిర్యాదు చేశారు. గ్రామాధికారి అడిగితే, చిన్నడు, "ఊళ్లోవాళ్ళకు దయ్యాల భయంలేకుండా చేస్తున్నాను. దయ్యాల భయం పోతేనేగాని దొంగల భయం పోదు," అన్నాడు.

గ్రామాధికారి చిన్నడి యుక్తిని అర్థం చేసుకుని మెచ్చుకుని, ఊళ్ళో దొంగతనాలను అరికట్టినందుకు చిన్నణ్ణి బహిరంగంగా సత్కరించాడు.

ఇది జరిగిన తరవాత ఒకరాత్రి దయ్యాల భవనంలో చిన్నణ్ణి కలుసుకునేటందుకు ఇద్దరు కుర్రవాళ్లు వచ్చి, "బాబూ, నువు ఊరికి కన్నపు దొంగల భయంలేకుండా చేశావుట. ఘరానా దొంగలను ఏమీ చెయ్యలేవా ?" అని అడిగారు.

"ఎవరా ఘరానా దొంగలు ?" అని చిన్నడు అడిగితే వాళ్ళు తమ తండ్రి గురించి చెప్పారు. వాళ్ళ తండ్రి గోపన్న. ఆయన బతికుండగా కరణం

దగ్గిర నాలుగువేలు అప్పుచేసి, పత్రం రాశాడు. తరవాత బాకీ తీర్చాడుగాని, కరణం పత్రాన్ని తిరిగి ఇయ్యలేదు. తరవాత కొద్దిరోజులకే గోపన్న చనిపోతూ తన కొడుకులతో, కరణంగారివద్ద పత్రం తిరిగి పుచ్చుకోమన్నాడు.

కరణం పత్రం గోపన్న కొడుకులకు తిరిగి ఇయ్యకపోగా, దాని ఆధారంతో గోపన్న ఇల్లు ఆక్రమించుకుని, అందులోనే ఉంటున్నాడు. గోపన్న కొడుకులకు నిలవనీడలేకుండా పోయింది.

''మీరు చెప్పినది నిజమవునో కాదో తెలుసుకుని, కరణంగారి సంగతి చూస్తాను. మీరు వెళ్ళండి,'' అని చిన్నడు వాళ్ళను పంపేసి, ఆ రాత్రి గస్తీతిరిగేటప్పుడు కరణంగారున్న ఇంటి గోడకు కన్నంపెట్టి వదిలేశాడు.

మర్నాడు ఉదయం చిన్నడు గ్రామాధికారి ఇంటికి వెళ్ళి, ''ఒక్కసారి కరణంగారిని పిలిపించండి,'' అన్నాడు.

కరణంగారు వస్తూనే చిన్నణ్ణి చూసి, ''ఏం బాబూ, నువు ఊరికి దొంగల బాధ లేకుండా చేశావని చెప్పుకుంటున్నారు గదా. రాత్రి మా ఇంటి గోడకు ఎవరో కన్నం వేశారు !" అన్నాడు.




''అది మనుషుల పని అయి ఉండదు, కరణంగారూ. దయ్యాల పని అయి ఉంటుంది !" అన్నాడు చిన్నడు.

''దయ్యాల పనా ? నీకెలా తెలుసూ ?'' అన్నాడు కరణంగారు.

''నేనుండేది దయ్యాల కొంపలోనే గదండీ ?" అన్నాడు చిన్నడు.

''అవునుగాని, ఆ దయ్యాలు నిన్నేమీ చెయ్యటంలేదా ?'' అని కరణంగారు అడిగాడు.

''వాళ్ళకు అపకారం చేస్తేనే అవి ఏమన్నా చేస్తాయి. నేను వాటికేం అపకారం చేశాను ? అన్నట్టు గోపన్న అన్న దయ్యం ఒకటి నాతో రోజూ తనకు

ఎవరో ద్రోహం చేశారంటుంది. అది మిమ్మల్ని ఒకరాత్రి దయ్యాల ఇంటికి రమ్మని చెప్పమన్నదండీ!'' అన్నాడు చిన్నడు.

కరణం ముఖం పాలిపోయింది. అతను వణకసాగాడు.

''దయ్యాలు చాలా మంచివి సుమండీ! ఇవాళరాత్రి మీరు నాతో రండి. మీతో గోపన్న ఏం మాట్లాడతాడో వినాలని ఉన్నది,'' అన్నాడు చిన్నడు మళ్ళీ.

''అవును, కరణంగారూ! దయ్యాలతో మాట్లాడే అవకాశం పోగొట్టుకోకండి,'' అన్నాడు గ్రామాధికారి.

''అమ్మో! నన్ను గోపన్న చంపేస్తాడు. వాడే మా ఇంటికి కన్నం వేసి ఉంటాడు!'' అన్నాడు కరణం.

''వాడికి మీ మీద ఎందుకు కోపం?" అని గ్రామాధికారి అడిగాడు.

''వాడు నా దగ్గిర డబ్బు తీసుకుని తిరిగి ఇచ్చాడు. కాని వాడు రాసిచ్చిన పత్రం నేను తిరిగి ఇచ్చే లోపల వా చచ్చిపోయాడు. దురాశతో నేను పత్రం చూపి, వాడి ఇల్లు స్వాధీ చేసుకున్నాను. వాడి పిల్లలకు దిక లేకుండా చేశాను. వాడు నా మీద పట్టినట్టున్నాడు," అన్నాడు కర వణికిపోతూ.

''అదా సంగతి ? అయితే ఆ ఇ వాడి పిల్లలకు తిరిగి ఇచ్చేసి, పరిహా కింద ఒక వెయ్యిరూపాయలు పిల్లల ఇచ్చుకోండి. మీ జోలికి రావద్దని గోప దయ్యానికి నేను చెబుతాను," అన్నా చిన్నడు.

కరణం గోపన్న పత్రాన్ని గ్రామ కారికి ఇచ్చి, గోపన్న ఇంటిని అ పిల్లల పరం చేసి, వాళ్ళకు వెయ రూపాయలు పరిహారం ఇచ్చాడు.

ఇది జరిగిన మర్నాడే చిన్నడు కుక్కతోసహా రామాపురం వది సంచారంమీద వెళ్ళిపోయాడు.






# వ్యర్థప్రాణులు

పూర్వం తక్షశిల విశ్వవిద్యాలయు స్నాతకోపన్యాసం చేస్తూ, వృద్ధుడైన ఒక అధ్యాపకుడు విద్యార్థులతో, ''మానవజన్మ ఉత్కృష్టమైనది. దానిని దుర్వినియోగపరచరాదు. మనిషి తన ప్రాణాన్ని పోగొట్టుకున్నా దానివల్ల దేశానికో, సంఘానికో, ఇతరులకో, కనీసం తనకో మేలు జరిగేటట్టు చూడాలి, కాని అకారణంగా ప్రాణాలను పోగొట్టుకుని వ్యర్థప్రాణు లనిపించు కోరాదు," అన్నాడు.

''ఎటువంటి వారు వ్యర్థప్రాణు లౌతారు, ఆచార్యులుగారూ ?" అని ఒక విద్యార్థి ప్రశ్నించాడు.

''అందుకు ఒక చిన్న కథ చెబు తాను,'' అంటూ ఆ వృద్ధ అధ్యాపకుడు ఇలా చెప్పాడు :

పూర్వం అంగదేశాన్ని సునందు డనే రాజు పాలించేవాడు. అతను సమర్థుడే అయినా, పరిస్థితుల వైపరీత్యంవల్ల అతని రాజ్యంలో అరాజకం బయలు దేరింది. అది అవకాశంగా చూసుకుని శత్రురాజులు అతని పైన ధ్వజమెత్తారు.

ఆ విధంగా సునందుడు బలవంతు డైన శత్రురాజునూ, తన రాజ్యంలోనే వుండి, అధికారం చేజిక్కించుకునేం దుకు ప్రయత్నిస్తున్న రాజద్రోహులనూ ఒకేసారి ఎదుర్కొవలసి వచ్చింది. అయినా, ఆయన నిరుత్సాహపడక, తన పరిపాలనకింద వున్న కత్తిపట్టగల ప్రతి పౌరుణ్ణీ సైన్యంలో చేర్చేందుకు గట్టి ప్రయత్నాలు ప్రారంభించాడు.

ఆ రాజ్యంలో, విలువిద్యలో అఖండు లైన ఇద్దరు వేటగాళ్లు వుండేవారు. వాళ్ళిద్దరినీ సైన్యంలో చేర్చటంవల్ల ఎంతో ప్రయోజనం వుంటుందని, సేనా

అన్వర్

నాయకుడు రాజుకు సలహా యిచ్చాడు. ఆ నిపుణులైన విలుకాళ్ళను, శత్రురాజు దాడికి వచ్చే మార్గంలో చెట్లపైన కాపు వుంచినట్టయితే, వాళ్లు శత్రుపక్షంలోని ముఖ్యులను విడివిడిగా, తమ బాణాలతో కొట్టి చంపగలరని సేనాని ఆశించాడు.

రాజభటులు ఆ విలుకాళ్ళ కోసం వెతుకుతూ బయలుదేరారు. ఆ సంగతి తెలుసుకున్న విలుకాళ్లు, రాజుగారి సైన్యంలో చేరి, దేశరక్షణకు ఉపయోగ పడేకన్న, స్వేచ్ఛగా అడవులలో వేటాడి బతకటమే మేలుగా భావించారు.

వేటగాళ్ళిద్దరూ, రాజభటుల కంట బడకుండా నగరం వదిలి, అరణ్యాల కేసి పోయారు. పగలంతా ఎంత వెతికినా వాళ్ళకు వేటాడేందుకు ఒక్క జంతువు కూడా కనబడలేదు. కాని, చీకటిపడే సమయానికి ఒక దుప్పి పిల్ల పొదల మధ్యగా పరిగెత్తుతూ వాళ్ళ కంట బడింది. వెంటనే ఇద్దరూ దాన్ని తమ బాణాలతో ఒకేసారి కొట్టారు. ఇద్దరూ మంచి గురికలవాళ్లు కావటంచేత దుప్పి పిల్ల ఆ క్షణమే చచ్చి పడిపోయింది.

తరవాత ఆ వేటగాళ్ళకు ఆ దుప్పి పిల్ల ఎవరికి చెందుతుందని వాగ్వాదం వచ్చింది. నాదంటే నాదని చాలాసేపు కీచులాడుకున్నారు. దాన్ని తానే ముందు చూసినట్టూ, తన బాణమే ముందు దానికి తగిలినట్టూ, దానితోనే అది చచ్చి పోయినట్టూ ఇద్దరూ మరికొంతసేపు వాదించుకున్నారు.

రాను రాను ఇద్దరికీ ఆవేశం పెరిగి పోయింది. చివరకు ఇద్దరూ తమ పిడి కత్తులు పైకి లాగి, ఒకరి నొకరు పొడుచుకుని, ఇద్దరూ చచ్చారు.

వృద్ధ అధ్యాపకుడు ఈ కథ చెప్పి, "ఇద్దరూ వ్యర్థప్రాణులే. వారు ఆ ప్రాణాలనే రణరంగంలో కోల్పోయి ఉంటే తమ దేశంకోసం ప్రాణత్యాగం చేసిన కీర్తి, వీరస్వర్గమూ కూడా లభించి ఉండును," అన్నాడు.






రాముడు అయోధ్య విడిచి, వనవాసానికి బయలుదేరింది చైత్ర శుద్ధ పంచమినాడు. పధ్నాలుగేళ్లు చైత్రశుద్ధ చవితికి పూర్తి అయాయి. ఆ మర్నాడు అతను భరద్వాజాశ్రమం చేరాడు. అతను భరద్వాజుడికి నమస్కరించి, ''స్వామీ, అయోధ్యానగరం సుభిక్షంగా ఉన్నదా? భరతుడు చక్కగా పరిపాలిస్తున్నాడా? మా తల్లులు సుఖంగా ఉన్నారా?'' అని అడిగాడు.

దానికి భరద్వాజుడు, ''భరతుడు దేహ సంస్కారం లేక, మట్టికొట్టుకుని, జుట్టు జడలు కట్టి, నీ పాదుకలు ముందుంచుకుని రాజ్యపాలన చేస్తున్నాడు. నీ రాకకోసం ఎదురు చూస్తున్నాడు. అంతా క్షేమంగానే ఉన్నారు.'' అని చెప్పాడు.

ఆయన రాముణ్ణి ఆ రోజు తన అతిథిగా ఉండి, మర్నాడు అయోధ్యకు వెళ్ళమని కోరాడు.

రాముడు ముందుగా హనుమంతుణ్ణి పంపదలచి, అతనితో, ''నువు శృంగిబేరపురానికి వెళ్లి అక్కడి బోయరాజైన గుహుడితో, నేను శత్రువులను జయించి, క్షేమంగా తిరిగి వస్తున్న సంగతి చెప్పు. నాకు అప్తుడైన గుహుడు చాలా సంతోషిస్తాడు. అతను నీకు అయోధ్యకు దారి చెప్పి, భరతుడి విశేషాలు కూడా చెబుతాడు. తరవాత నువు భరతుణ్ణి కలుసుకుని, నా క్షేమం తెలిపి, నేను వనవాసం



భరతుడికి రాజుగా ఉండాలన్న కోరిక ఉంటే, పోనీ అతన్నే పాలించనీ! నువు మాత్రం మేం ఎక్కువ దూరం ప్రయాణం చెయ్యకముందే తిరిగి రావాలి," అన్నాడు.

రాముడు ఇలా ఆజ్ఞాపించగా హనుమంతుడు మనుష్య రూపంలో ఆకాశ మార్గాన అయోధ్యకు వేగంగా బయలుదేరాడు. అతను శృంగిబేరపురం చేరి, గుహుణ్ణి కలుసుకుని, "రాముడు తన క్షేమం నీకు తెలుపమన్నాడు. అతను సీతా లక్ష్మణులతో సహా ఈ రాత్రికి భరద్వాజాశ్రమంలో ఉండి, రేపు ఉదయం బయలుదేరుతాడు. త్వరలోనే నువు అతన్ని చూడగలవు," అని అతనితో చెప్పి, తిరిగి ఆకాశ మార్గాన అతివేగంగా బయలుదేరి, నందిగ్రామం చేరబోయాడు.

నందిగ్రామం చుట్టూ ఉండే చెట్లు చాలా అందంగా, నందనోద్యానానికి సాటివచ్చేవిగా ఉంటాయి. అక్కడికి అయోధ్య రెండు ఘడియల ప్రయాణం. అక్కడ భరతుడు ఆశ్రమం నిర్మించుకుని, జింకతోళ్ళే బట్టలుగా ధరించి, పధ్నాలుగేళ్ళు నిండినా రాముడు ఇంకా రాలేదే అని విచారంగా ఉన్నాడు. అతను స్నానం లేక మట్టిగొట్టుకొని ఉన్నాడు. జుట్టు జడలు కట్టుకుపోయింది. అతను కేవలమూ కందమూల ఫలాలే తింటు

పూర్తిచేసి సీతా లక్ష్మణ సహితంగా వస్తున్నానని చెప్పు. నువు భరతుడితో సీతాపహరణం లగాయతు రావణ సంహారం వరకూ విపులీకరించి చెప్పి, అతని ముఖాన ఎలాటి భావాలు గోచరిస్తాయో శ్రద్ధగా గ్రహించు. నేను శత్రువుల నందరినీ జయించి, అంతులేని కీర్తి సంపాదించి, మహా బలవంతులైన స్నేహితులతో వస్తున్నానంటే భరతుడి మనసులో ఎలాటి వికారాలు కలుగుతాయో నువు తెలుసుకుని రావాలి. తండ్రి తాతల రాజ్యాన్ని అనుభవిస్తున్నవాడికి దాన్ని విడిచిపెట్టటం చాలా కష్టం. చాలా కాలంగా రాజ్యపాలన చేస్తున్న

న్నాడు. ఆ స్థితిలోనే అతను మంత్రులనూ, పురోహితులనూ, సేనాధ్యక్షులనూ వెంట బెట్టుకుని రాజ్యం పాలిస్తున్నాడు. అతని కింద కొలువు చేస్తున్న వారందరూ కాషాయవస్త్రాలు ధరించి ఉన్నారు.

హనుమంతుడు భరతుణ్ణి చూసి, నమస్కరించి, ''రాముడు తన క్షేమం నీకు చెప్పమన్నాడు. నీ విచారం తొలగించే వార్త చెబుతాను. నువు త్వరలోనే రాముణ్ణి చూడగలవు. రాముడు రావణుణ్ణి చంపి, సీతను తిరిగి పొంది, కోరికలన్నీ తీరినవాడై, మహా బలవంతులైన మిత్రులతో సహా వస్తున్నాడు. అతని వెంట సీతా, లక్ష్మణుడూ కూడా వస్తున్నారు.'' అని చెప్పాడు.

ఈ వార్త వినగానే భరతుడు సంతోషం పట్టలేక మూర్ఛపోయాడు. తరవాత మూర్ఛతేరి అతను హనుమంతుడితో, ''అయ్యా, నాకు ఇంత ప్రియమైన వార్త తెచ్చిన నువు మనిషివో, దేవతవో తెలియదు. నీకు బహుమానంగా లక్ష గోవులూ, నూరు గ్రామాలూ, సమస్త ఆభరణాలూ, పధ్నాలుగురు చక్కని కన్యలనూ ఇస్తాను,'' అన్నాడు.

అతను కోరినమీదట హనుమంతుడు, భరతుడు రామపాదుకలు తీసుకుని చిత్రకూటం నుంచి అయోధ్యకు తిరిగి



పోయిన అనంతరం జరిగిన విషయాలన్నీ చెప్పాడు.

భరతుడు అంతా విని పరమానంద భరితుడై, శత్రుఘ్నుడితో, ''పురుషులందరూ చక్కగా స్నానం చేసి, పట్టణంలోని చతుష్పథ మంటపాలలో దేవతలనందరినీ సుగంధ పుష్పాలతోనూ, వాద్యాలతోనూ పూజించేటట్టు చూడు. రాముణ్ణి చూడటానికి వైతాళికులూ, వేశ్యలూ, బాజా భజంత్రీలతో గుంపులు, గుంపులుగా బయలుదేరాలి.'' అని ఆజ్ఞాపించాడు.

శత్రుఘ్నుడు అనేక వేలమంది సేవకులను పిలిపించి, ''మీరు నందిగ్రామం



నుంచి అయోధ్య దాకా గల దారిని మిట్టపల్లాలు లేకుండా చదును చెయ్యండి. కొందరు దారి పొడుగునా మంచులాటి చల్లని నీరు చల్లి, పైన పూలు పరచండి. తెల్లవారే లోపల అయోధ్యలో వీధులన్నిటినీ, ఇళ్ళనన్నిటినీ అలంకరించాలి. విశాలమైన రాజమార్గం పొడుగునా పూల తోరణాలు కట్టి, పూలూ, గంధమూ చల్లి, అయిదు రంగుల చూర్ణాలతో ముగ్గులు పెట్టాలి," అని ఆజ్ఞాపించాడు.

రాణులూ, మంత్రులూ, సైనికులూ, వాళ్ళ భార్యలూ, బ్రాహ్మణులూ, క్షత్రియులూ, గణనాయకులూ, గణాలవారూ రాముణ్ణి చూడటానికి బయలుదేరారు. కొందరు ఏనుగులమీదా, కొందరు రథాల మీదా వెళ్ళారు. సైనికులు రకరకాల ఆయుధాలు పట్టుకుని నడిచారు. ధృష్టి, జయంతుడూ, విజయుడూ, సిద్ధార్థుడూ, అర్థసాధకుడూ, అశోకుడూ, మంత్రపాలుడూ, సుమంత్రుడూ అనే మంత్రులు బయలుదేరారు. దశరథుడి భార్యలు వాహనాలలో నందిగ్రామం చేరారు.

భరతుడు రామ పాదుకలు నెత్తిన పెట్టుకుని రాముడికి ఎదురు బయలు దేరాడు. అతని వెంట బ్రాహ్మణులూ, వర్తకులూ, పురప్రముఖులూ, దండలు చేతపట్టుకుని మంత్రులూ, స్తోత్ర పాఠకులూ బయలుదేరారు. భరతుడి వెంట రాజ చిహ్నలయిన ఛత్ర, చామరాలూ, బంగారు దండమూ వెళ్లాయి.

ఎంతసేపటికీ రాముడు ఎదురు రాకపోయేసరికి భరతుడు హనుమంతుడితో, "కోతిబుద్ధి కారణంగా రాముడు వస్తున్నాడని చెప్పావా ఏం? ఏడీ రాముడు? కనిపించడేం?" అని అడిగాడు.

"భరద్వాజ మహాముని వానర సేనలకు బ్రహ్మండమైన విందు చేశాడు. ఆయన ఆశ్రమంలో చెట్లన్నీ ఫలపుష్పాలతో నిండి, వానరులకు ఉత్సాహం కలిగించాయి. వాళ్ళ కోలాహలం వినిపిస్తున్నది. వాళ్ళు

ఇప్పుడు గోమతీ నదిని దాటుతున్నట్టు తోస్తున్నది. అదుగో పుష్పకం! దూరాన కనిపిస్తున్నది. ఒకప్పుడు కుబేరుడిదైన ఈ విమానం ఇప్పుడు రాముడి దయింది. అందులో రాముడితోబాటు సీతాదేవీ, లక్ష్మణుడూ, వానర రాజైన సుగ్రీవుడూ, రాక్షస రాజైన విభీషణుడూ ఉన్నారు,'' అని హనుమంతుడు భరతుడితో అన్నాడు.

వెంటనే, ''అడుగో, రాముడు! వస్తున్నాడు!'' అన్న కేకలు మిన్ను ముట్టాయి. రాముణ్ణి చూడటానికి వచ్చిన వారందరూ తమ తమ వాహనాల మీది నుంచి దిగి, నేలమీద నిలబడ్డారు.

రాముడు రానే వచ్చాడు. తన ఎదురుగా నిలబడిన రాముడికి నమస్కారం చేసి, భరతుడు, ''అన్నమాట తప్పకుండా మా అందరికీ శుభం కలిగే లాగు వచ్చావు," అని పొగడాడు.

రాముడు భరతుణ్ణి విమానంలో ఎక్కించుకుని, ఆనందంతో కౌగలించు కున్నాడు. భరతుడు లక్ష్మణుణ్ణి పరామర్శించి, సీతకు నమస్కారం చేశాడు. అతను వానర వీరులందరినీ కౌగలించు కున్నాడు. అతను సుగ్రీవుడితో, ''నువు మా నలుగురు అన్నదమ్ములకూ అయిదోవాడివి అయావు. ఉపకారం చేసినవాడు మిత్రుడవుతాడు,'' అని, విభీషణుడితో, ''నువు మాకు గొప్ప సహాయం చేశావు,'' అన్నాడు.

శత్రుఘ్నుడు రామ, లక్ష్మణులకు నమస్కారం చేసి, సీత పాదాలకు





వందనం చేశాడు. రాముడు తన తల్లిని చూడబోయి, ఆమె పాదాలకు నమస్కారం చేశాడు, తరవాత సుమిత్రకూ, కైకేయికీ, వసిష్ఠుడికీ నమస్కారం చేశాడు. పౌరులందరూ రాముడికి సంతోషంగా స్వాగతం పలికారు.

భరతుడు రాముడి పాదుకలను తన చేత్తోనే రాముడి కాళ్ళకు తగిలించాడు. అతను రాముడితో, "ఇన్నాళ్ళూ నేను చూస్తూ ఉండిన నీ రాజ్యాన్ని తిరిగి నీకు ఇచ్చేశాను. నువు మళ్ళీ అయోధ్యకు తిరిగి రావటం కళ్ళారా చూశానుగనక నా జన్మ సార్థకమయింది. నా కోరిక నెరవేరింది," అన్నాడు.

రాముడు విమానంతోనే నందిగ్రామం చేరాడు. అక్కడ అతను తన వెంటవున్న వారందరితోపాటు విమానం నుంచి దిగి, ఆ విమానాన్ని కుబేరుడి దగ్గిరికి వెళ్ళిపొమ్మన్నాడు.

రాముడి పట్టాభిషేకానికి ముహూర్తం నిర్ణయమయింది. రామ, లక్ష్మణ, భరతులు మంగళ్ళచేత క్షౌరం చేయించుకున్నారు. భరతుడూ, లక్ష్మణుడూ, సుగ్రీవుడూ, విభీషణుడూ, రాముడూ వరసగా మంగళ స్నానాలు చేశారు. రాముడు పుష్పమాలలు ధరించి, శరీరానికి చందనం పూయించుకుని, పచ్చని పట్టుబట్టలు కట్టుకుని సింహాసనం మీద కూర్చున్నాడు. శత్రుఘ్నుడు రామ, లక్ష్మణ, భరతులకు హారాలూ, కేయూరాలూ, ఇతర ఆభరణాలు తొడిగి అలంకరించాడు. దశరథుడి భార్యలు సీతను అలంకరించారు

సుమంత్రుడనే సారథి రాముడి కోసం రథం తెచ్చి, అందులో రాముణ్ణి ఎక్కించుకున్నాడు. సుగ్రీవుడూ, హనుమంతుడూ స్నానాలు చేసి, మంచి బట్టలూ, ఆభరణాలూ ధరించి, అయోధ్యకు బయలుదేరారు.

దశరథుడి మంత్రులు ముందుగానే అయోధ్యకు పోయి, వసిష్ఠుడితో సంప్ర

తించి, పట్టాభిషేక సన్నాహాలు చేయించారు.

రాముడు తనకు సుగ్రీవుడితో మైత్రీ, హనుమంతుడి ప్రభావమూ, యుద్ధంలో వానరులు చూపిన పరాక్రమమూ, విభీషణుడు తన పక్షం వచ్చెయ్యటమూ చెప్పితే, పౌరులు ఆశ్చర్యపోయారు. రాముడు దశరథుడి మందిరం ప్రవేశించాడు. రాముడి మందిరం, అంతః పురోద్యానంతో సహా, సుగ్రీవుడికి విడిదిగా ఏర్పాటు చేయబడింది.

సుగ్రీవుడు నాలుగు బంగారు కలశాలను నలుగురు వానరోత్తములకిచ్చి, "రేపు తెల్లవారేసరికి, మీరు నాలుగు సముద్రాల జలంతోనూ సిద్ధంగా ఉండాలి," అని ఆజ్ఞాపించాడు.

జాంబవంతుడూ, హనుమంతుడూ, వేగదర్శీ, ఋషభుడూ కలశాలు తీసుకుని, అయిదు వందల నదుల జలాలు తెచ్చారు. నాలుగు సముద్ర జలాలు కూడా వచ్చేశాయి.

తరవాత శాస్త్రోక్తంగా రాముడి పట్టాభిషేకం జరిగింది. రాముణ్ణీ, సీతనూ రత్న ఖచితమైన పీఠం మీద కూర్చోబెట్టారు. తరవాత ఋత్విజులూ, బ్రాహ్మణులూ, కన్యకలూ, పౌరులూ, యోధులూ ఒకరి తరవాత ఒకరు రాముణ్ణి అభిషేకించారు.

రాముడికి శత్రుఘ్నుడు తెల్లగొడుగు పట్టాడు. సుగ్రీవుడు వింజామర వీచాడు. విభీషణుడు మరొక వింజామర వీచాడు.

తన పట్టాభిషేక సందర్భంలో రాముడు బ్రాహ్మణులకు దూడలతో సహా గోవులనూ, బంగారాన్నీ, బట్టలనూ దానం చేశాడు. అతను సీతకు ఒక ముత్యాలహారం ఇచ్చి, వానరులలో తనకు ఎక్కువ అభిమానం గల వాడికి దాన్ని ఇయ్యమన్నాడు. సీత వెంటనే దాన్ని హనుమంతుడికి ఇచ్చింది. తరవాత రాముడు ఇతర వానరవీరులకు బహుమానాలిచ్చాడు.

విభీషణుడు లంకకు తిరిగి వెళ్ళాడు. తరవాత రాముడు భరతుణ్ణి యువరాజుగా చేసి, రాజ్యపాలన చేయసాగాడు.





# చాంద్‌బీబీ

చాంద్‌బీబీ, అహమ్మద్‌నగర్ సుల్తానయిన హుసేన్ నిజాం షా (**1554–1565**) కుమార్తె. ఆమె అద్భుత సౌందర్యవతి. బాల్యమంతా జనానాలోనే గడిపినా, ఆమె వివేకం, ధైర్య సాహసాలూ గలదిగా, ఆ పిన్న వయసులోనే పేరు తెచ్చుకున్నది.



షోలాపూర్ నగరం ఎవరికి చెందాలన్న వివాదంతో, అహమ్మద్ నగర్, బిజాపూర్ పాలకుల మధ్య శత్రుత్వం ఏర్పడింది. అది కొనసాగటం క్షేమం కాదనుకున్న అహమ్మద్ నగర్ సుల్తాను, తన కుమార్తె చాంద్‌బీబీకి, బిజాపూర్ సుల్తానయిన అలీ ఆదిల్ షా తో పరిణయం జరిపి, అతడికి కట్నం కింద షోలాపూర్ నగరాన్ని యిచ్చాడు.



సుల్తాన్ ఆదిల్ షా **1580** లో హత్య చేయబడ్డాడు. అతడికి పిల్లలు లేని కారణం వల్ల, తొమ్మిదేళ్ళ వయసువాడైన, అతడి తమ్ముడి కుమారుడు ఇబ్రహీం అనేవాడు, సుల్తానయాడు. చాంద్‌బీబీ ఆ బాలుడికి సంరక్షకురాలుగా బిజాపూర్ పరిపాలన నిర్వహించసాగింది. అప్పటి ఆమె పరిపాలనా దక్షతను, ప్రతి ఒక్కరూ ఎంతగానో ప్రశంసించారు.



అయితే, ధన దాహంతో ప్రజలను పీడిస్తూ, ఖజానాను కూడా కొల్లగొట్ట దలచిన సర్దారులకు, చాంద్‌బీబీ అధికారం కంటగింపుగా తయారైంది. వాళ్ళు బాలుడైన సుల్తానుతోపాటు, చాంద్‌బీబీని కూడా హత్య చేసేందుకు కుట్ర చేయసాగారు. అది తెలిసిన చాంద్‌బీబీ, తన సంరక్షణలో వున్న సుల్తానును వెంటబెట్టుకుని, తన పుట్టినిల్లయిన అహమ్మద్ నగర్‌కు వెళ్ళిపోయింది.



ఆ సమయంలో చాంద్‌బీబీ సోదరుడైన ముర్తజా అహమ్మద్ నగర్ సుల్తానుగా వున్నాడు. అతడు దాదాపు వెర్రివాడు. హుసేన్ అనే అతడి కుమారుడి చేతనే, ముర్తజా హత్య చేయబడ్డాడు. ఈ హుసేన్ పరమ క్రూరుడు. సర్దారులు తిరగబడి అతణ్ణి చంపి, అతడి సోదరుడి కుమారుణ్ణి సుల్తానుగా ప్రకటించారు. ఈ దురదృష్టకర సంఘటనలు చాంద్‌బీబీని చాలా కలతపరిచినై.



అహమ్మద్ నగర్‌లో రేగిన ఈ అరాజకం సంగతి, ఢిల్లీలోని మొగల్ చక్రవర్తి అయిన అక్బర్‌కు తెలిసింది. అహమ్మద్ నగర్‌ను జయించటానికి యిదే మంచి అదననుకుని, అక్బర్ పెద్ద మొగల్ సేనను అహమ్మద్ నగర్ పైకి పంపాడు. అహమ్మద్‌నగర్ సేనలో యుద్ధ నైపుణ్యం గల సేనానులు లేరని గ్రహించిన చాంద్‌బీబీ, తానే స్వయంగా సైనికనాయకత్వం వహించింది.

మొగలులు కోటను ముట్టడించి, ముందుగా దాని బురుజులను పడ కొట్టేందుకు పథకం వేశారు. చాంద్‌బీబీ బురుజులను కాపాడుకునేందుకు మొగలులతో పోరాటం సాగించింది. అయినా అధిక సంఖ్యలో వున్న మొగలులు ఒక బురుజుకు తుపాకీ మందు దట్టించి, దాన్ని పేల్చారు. కాని, ఆ సరికి సూర్యాస్తమయం కావటంతో, వాళ్ళు కోటలో జొర బడేందుకు సాహసించలేకపోయారు.





చాంద్‌బీబీ రానున్న ప్రమాదాన్ని గుర్తించి, ఆ రాత్రికి రాత్రే కోటలో వున్న ఆడా, మగా అందర్నీ సమీకరించి, తెల్లవారేలోపల బురుజులో పడిపోయిన భాగాలను రాళ్ళతో మూయించి, ఎప్పటిలా కట్టుదిట్టం చేసి, సైనికులను కాపుపెట్టింది.

మొగలులు కూల్చిన బురుజు గోడలను తిరిగి మరమ్మతు చేయటమేగాక, చాంద్‌బీబీ ఆ రాత్రివేళలోనే కోట గోడల పైన ఫిరంగులను అమర్చి, సూర్యోదయంతోనే దాడి చేయనున్న మొగలులపై ఫిరంగి గుండ్లను ప్రయోగించేందుకు సిద్ధపరిచింది.





తెల్లవారుతూనే మొగల్ సైనికులు మరింత తీవ్రంగా విజృంభించారు. కొంతసేపు భయంకర పోరాటం జరిగాక, వార్తాహరుల ద్వారా చాంద్ బీబీకి మందుగుండు సామగ్రి అయిపోయినట్టు తెలిసింది. ఆమె కోటలో వున్న బంగారు, వెండి, రాగి నాణాలనే కాక, నగలను కూడా కరిగింపించి, ఆ గుళ్ళను ఫిరంగులలో దట్టించి, శత్రువులపై ప్రయోగించింది.



మరొకసారి మొగలుల దాడి విఫలం కావటమేగాక, వాళ్ళు అధికమైన సైనిక నష్టం కూడా పొందారు. ఇక కోటను వశపరచుకోవటం అసంభవం అని గ్రహించిన మొగలు సేనాని, చాంద్ బీబీతో రాజీపడి, అప్పటికి తిరిగి వెళ్ళిపోయాడు.



చాంద్ బీబీ జీవించి వుండగా, అహమ్మద్‌నగర్‌ను జయించలేమని మొగలులు తెలుసుకున్నారు. మరికొంత కాలానికి పెద్ద సేనతో వాళ్లు మరొకసారి అహమ్మద్‌నగర్ కోటను ముట్టడించారు. ఈ సారి యుద్ధం ప్రారంభమవుతూనే, చాంద్‌బీబీ కోటలోని విరోధివర్గం చేత హత్య చేయబడింది. కాని, అప్పటికే ఆమె భారతదేశ చరిత్రలోని ప్రముఖ మహిళలలో ఒకతెగా తన స్థానాన్ని సుస్థిరం చేసుకున్నది.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

?

అవంతికి ఉన్న ఆస్తి అంతా కలిపి ఒక బంగారు ఉంగరం. వర్తకం చేసుకునే అతని మిత్రుడొకడు ఆ ఉంగరాన్ని కాజెయ్యాలని, అవంతితో, "మిత్రమా, నేను వ్యాపారం నిమిత్తం దీర్ఘప్రయాణం మీద పోతున్నాను. అంతకాలం నిన్ను చూడనుగదా అని బెంగగా ఉన్నది. అందుచేత నీ ఉంగరం ఇచ్చావంటే, అది చూసినప్పుడల్లా నిన్ను చూసినట్టే సంతోషిస్తాను," అన్నాడు.

దానికి అవంతి, "అయ్యో మిత్రమా! నేను మాత్రం నిన్ను చూడకుండా అంతకాలం ఎలా ఉండగలను? నేను నీకు ఈ ఉంగరం ఇయ్యకపోతే, దీన్ని చూసినప్పుడల్లా, దీన్ని నీకు ఇయ్యలేకపోయానుగదా అన్నది జ్ఞాపకం వచ్చి, నిన్ను చూసినట్టే ఆనందం కలుగుతుంది!" అన్నాడు.

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, **2 & 3** ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు **600 026** అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలించబడవు.

కార్డులు మాకు నవంబర్ **20** లోగా చేరాలి. అందులో ఫొటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, **'78** జనవరి చందమామలో ప్రకటింపబడును.

---

సెప్టెంబర్ నెల పోటీ ఫలితం: కథ కంచికి-ఆవు ఇంటికి.

గెలుపొందిన వారి పేరు: గోరంట్ల మాధవక్రిష్ణయ్య, మల్లికార్జునపల్లి. (కర్నూలుజిల్లా.)

# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1978 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.







P. Sundaram

Dilip V. Pamkar

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ నవంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : పేదల జీవితం

రెండవ ఫోటో : ప్రమాదభరితం

పంపినవారు : జి. భారతి, పరిషదున్నత పాఠశాల, చాగలమర్రి.

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI. CHANDAMAMA is published monthly and distributed in U.S.A. by Chandamama Distributors, West Chester PA 19380. Subscription 1 year $ 6-50. Second Class Postage paid at West Chester, PA.

క్రొత్తది!

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన

# ఆముదము

శుద్ధిచేసినది.
వాసనలేనిది.




మూడు
సైజులలో
లభిస్తుంది:
50 మిలి
100 మిలి
200 మిలి

అమృతాంజన్ ఆముదము

OBM 3270/3 TG(R)





వచ్చింది దీపావళి సందడి మళ్ళీ...
మరిక ధరించాలి ముచ్చటగొల్పే
కరోనా
పాదరక్షలు
సెన్సేషన్
దిలీప్ వెజ్
కమల్
ఆశా
నిక్కీ




Carona
తయారుచేయువారు :
కరోనా సాహు కం. లి.
రిజి. ఆఫీస్: 221, దాదాభాయ్ నౌరోజి రోడ్, బొంబాయి 400 001.
CHAITRA-CS-87 TEL

# కదలండి, ఆనందాన్ని ఆవిష్కరించుకోండి








PRS/2771 TEL

'తీసుకోండి,
రుచి అంటె ఏమిటో
తెలుస్తుంది.'

'తీసుకోండి,
అసలైన రుచి మీకే
తెలుస్తుంది.'







Creative Unit-A 2758

గోల్డ్ స్పాట్–దీని రుచి పెదవిపై చిరునవ్వుగా మారుతుంది.


ఇన్సూరెన్స్ ప్రీమియం, ఆదా యం పన్ను కూడా నోట్ చేయండి.
శ్రీగోపాలరావు ఎలక్ట్రిక్ బిల్లు


ఇవన్నీ కూడా మీరు చేస్తారా?
బ్యాంక్‌లో డబ్బు వుంచుకుంటే ఇలాంటి చిల్లర మల్లర పనులు తప్పుతాయి.


మా అబ్బాయి డబ్బు పంపించాడా?
పంపించాడు


వాళ్లబ్బాయి మరో చోట వుద్యోగం చెస్తున్నారు. బ్యాంకు ద్వారా డబ్బు పంపడం వల్ల డబ్బు ఆలస్యంగా అందడం, డబ్బు పోవడం వుండదు.


అమ్మా, నా నగల్ని బ్యాంకులో నుండి తీసున్నావా?


ఇవి లాకర్లు,స్వల్పంగా అద్దె తీసుకొని విలువైన పత్రాలు, నగలు దాచుకో నిస్తారు.
చిన్న చిన్న పావురాయి గూళ్లలా ఎంత బాగున్నాయో!


యూకోబ్యాంక్ యింకా ఏమేమి చేమంది?


మేము వ్యాపారం వాణిజ్యం అభివృద్ధి అయ్యేందుకు తోడ్పడుతాం.


ఎలా తోడ్పడుతారు?


డబ్బు అప్పు యిచ్చి. బ్యాంక్ ద్వారా యిచ్చి పుచ్చుకొనే నదుపాయం వుంటుంది.

ఇంకావుంది